శ్రీ ర స్తు.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# భీమసేన విలాసము.

## యక్షగానము.



ఇది,

వేస్టువార్డు అండు కంపెని వారిచే

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

చెన్నపట్టణము.

1936.

# నాటకములు, యక్షగానములు.



| | |
|---|---|
| జే-విరాటనాటకము | 0-4-0 |
| విభీషణపట్టాభిషేకనాటకము | 0-4-0 |
| శ్రీమతీస్నిమలపంటు ద్రౌపతికల్యాణనాట | 0-4-0 |
| సైంధవపరాభవ నాటకము | 0-2-0 |
| చుక్కలూరు రామ నాటకము | 0-4-0 |
| కుచేలోపాఖ్యాననాటకము | 0-8-0 |
| సూక్ష్మరామాయణ నాటకము | 0-4-0 |
| మత్తిగుంట శశిరేఖాపరిణయనాటకము | 0-3-0 |
| చెంచునాటకము | 0-1-0 |
| ద్రౌపతీవస్త్రాపహరణ నాటకము | 0-2-0 |
| నలచక్రవర్తి నాటకము | 0-8-0 |
| సారంగధరనాటకము | 0-1-0 |
| మాయలమల్లినాటకము | 0-1-0 |
| గయోపాఖ్యాననాటకము | 0-4-0 |
| సత్యహరిశ్చంద్రనాటకము | 0-3-0 |
| మైరావణనాటకము | 0-6-0 |
| ధర్మాంగదనాటకము పాలుట్లలక్ష్మ | 0-3-0 |
| సంతవేలూరు రామనాటకము | 0-12-0 |
| వీరభద్రనాటకము | 0-8-0 |
| చిత్రాంగినాటకము | 0-6-0 |
| వేముల ఉషాపరిణయనాటకము | 0-2-0 |
| వే-విరాటపర్వనాటకము | 0-4-0 |
| బె-హరిశ్చంద్రనాటకము | 0-4-0 |
| లేపాక్షికృష్ణజలక్రీడనాటకము | 0-2-0 |
| రామానుజ ప్రహ్లాదనాటకము | 0-4-0 |
| తిరునారాయణ ప్రహ్లాదనాటకము | 0-4-0 |
| సుబ్బకవి ప్రహ్లాదనాటకము | 0-2-0 |
| మత్తినగర సావిత్రినాటకము | 0-4-0 |
| సత్యభామకల్యాణనాటకము | 0-8-0 |
| రామనాటకము | 0-8-0 |
| పురూరవ జననాటకము | 0-2-0 |

| | | |
|---|---|---|
| అనిరుద్ధనాటకము | | 0-8-0 |
| మార్కండేయనాటకము | | 0-8-0 |
| వెలిగండ్ల వీరవిజయవిలాసనాటకము | | 0-2-0 |
| చంద్రసేనమహారాజునాటకము | | 0-4-0 |
| విప్రనారాయణ యక్షగానము | | 0-4-0 |
| భళ్ళాణరాజు | ,, | 0-8-0 |
| చిరుతొండ | ,, | 0-8-0 |
| హరిశ్చంద్ర | ,, | 0-2-0 |
| శిరియాళనాటకం | ,, | 0-2-0 |
| రుక్మాంగదనాటకం | ,, | 0-2-0 |
| గౌరీశంకరవిలాసం | ,, | 0-2-0 |
| రామదాసుచరిత్ర | ,, | 0-8-0 |

## జంగంకథలు.

| | |
|---|---|
| చిన్నప్పరెడ్డి కథ | 0-1-0 |
| కాంభోజరాజు కథ | 0-1-6 |
| పెద్దబొబ్బిలిరాజు కథ | 0-4-0 |
| బాలనాగమ్మ కథ | 0-8-0 |
| అంబరీషోపాఖ్యాన జంగంకథ | 0-8-0 |
| విరాటపర్వం జంగంకథ | 0-8-0 |
| గయోపాఖ్యానం జంగంకథ | 0-2-0 |
| చిన్నమ్మ కథ | 0-1-6 |
| లక్ష్మమ్మ కథ | 0-1 |
| కామమ్మ కథ | 0- |
| దేవయానచరిత్ర జంగంకథ | 0- |
| భల్లాణ జంగంకథ | 0-2 |
| రుక్మిణీకల్యాణం జంగంకథ | 0- |
| శిరియాళ జంగంకథ | 0-2 |
| గాంధారి కథ | 0-8- |
| దేశింగురాజు కథ | 0-8-0 |
| బంగారు తిమ్మరాజు కథ | 0-1-0 |
| వామనవిజయం జంగంకథ | 0-2-0 |

వెస్టువార్డు అండు కంపెని,

చాకలపేట, మదరాసు.

    

శ్రీ కురుమూర్తి వేంకటేశాయ నమః.

శ్రీ సుందరగిరి పరమేశాయ నమః.

# భీమసేనవిలాసం - యక్షగానము.



క॥ శ్రీలాలిత నవమౌక్తిక । మాలాయుతకలిత శ్రీరమాయుతవక్షా ।
చాల ప్రార్థించెదయిల । వేలుపు కురుమూర్తి శరణ వేంకటరమణా॥

దరువు॥ శ్రీరామారమణిమనోహరాసింధుగంభీర - పారావారాభక్త లోకోపకార॥ శ్రీ॥ కామితఫలదాయకాగౌరీశసఖ - సామాజాధిప పోషకా సద్గుణానే॥ శ్రీ॥ ద్రౌపతిమానాభిరక్షా దైవదృతాక్షా - పాపారాక్షస శిక్షాపాలితాపాండవపక్షా॥ శ్రీ॥ సురముని పూజితాచరణా సుందార - భరణాకురుమూర్తి వేంకటారమణా గురుతరాకరుణా॥ శ్రీ॥



## వినాయక స్తుతి.

దరువు.

శ్రీగిరిజావరపుత్రా శృంగారచారిత్ర - భోగీవేష్టితగాత్ర బుధసంస్తుత పాత్ర॥ శ్రీ॥ రవికోటినిభ తేజ రమణీయపాదాంభోజ - నతజనకల్పక భూజా ఘనవిఘ్న రాజా॥ శ్రీ॥ అఖిలాగమనిర్ణిత ప్రకటావిద్యా ప్రదాతఅఖిలా లోకఖ్యాతి ఆదిగణనాథా॥ శ్రీ॥ గురుతరశ్రీకురుమూర్తి గిరిసుకందరవతిః - హరిఘసుతశరణార్థి తరిపాలికమూర్తి॥ శ్రీగిరి॥



## సరస్వతీ స్తుతి.

### దర్వు.

దేవిభారతీవాగ్దేవివినుసతీ - తాపకపదసేవనొసగి బ్రోవవె కరుణామతీ॥ దేవి॥ విమలకమలసదృశ పాణిసుమనో సుతగుణశ్రేణీ - అమితఅమిత గేయవీణాసరణీరణిమమ దేహిసుప్రపాణి॥ దేవి॥ పలుకులందు నమృతబిందు లొలుకగవర మొసగుమందు - చెలువలరగ ప్రకృతమందు దలచితినే ముందుముందూ॥ దేవి॥ స్థిరతరమగుకురుమతి భూధరనిలయుని వరతనూజుని - తరుణీమణికరుణించవె సురుచిరమగువాక్యశ్రేణి॥ దే॥

## శక్తి స్తుతి.

### దర్వు.

హిమగిరివరజాతా - హేమాత హిమ॥ ప॥ సుమనస్తోత్రితను గుణోపేత - మమాభీష్టఫలదాత మహితవిఖ్యాత॥ హి॥ ఘననిభ వేణీకంజ సుపాణి - వినమితమునిశ్రేణివినుతగీర్వాణి॥ హి॥ స్థిరశుభకారిశ్రితమనోహారి - కురుమతిహరిసోదరీ కుజనవిదారి॥ హిమ॥

## సభాకైవారం.

శ్రీమద్రమారమణీ మనోహరునిజాంబూనదాంబరధారుని శంఖచక్రగధాసందక ధారుని చతుర్భుజుని శ్రీకురుమూర్తి వెంకటేశ్వరుని పదపంకజంబుల నిరంతర ధ్యానమానసుండైన శ్రీమంతు మహారాజాధిరాజ ముక్కరసవాయి సోమభూపాల్ రావు బలవంతుబహద్దరుగారి అర్ధాంగియైౖ దేశాయి వెంకటలక్ష్మాంబావరగర్భోద్భవుండైన శ్రీమంతురాజాముక్కరవంశక్షీరపారావారుండైన శ్రీసీతారామాభూపాల్ గారి ఆశ్రితుండునై నేను విద్వజ్జనసమూహంబుల శిరసావహించి శ్రీ మహాభారతంబునంగల విరాటపర్వంబు యక్షగానం

బొనర్చి శ్రీకురుమూర్తి వెంకటేశ్వరునికి సమర్పణంబు సేయం బూనినాడ చిత్తగించ వలసినది.

మాటలు. శ్రీమతు వనపర్తి సమస్తానం యిలాకాలోచేరిన రామకృష్ణాపురగ్రామనివాసుడగు శివపూజా ధురంధరుడైన వావిళ్ళవంశ పయఃపారావార రాకాసుధాకరుం డైన బుక్కు లక్ష్మయ్య హాకీము కుమారుండగు సిద్ధాంతి అచ్చు వేయించిన గ్రంధాలవివరం: భీమసేనవిలాసము, తారాశశాంక నాటకము, తమ్మాజి పేట హరిశ్చంద్ర నాటకము, మన్నెంకొండ హనుమద్దాసుచరిత్రము ద్విపద వాక్యము, యిన్ని గ్రంధములు స్వంత ద్రవ్యం ఖర్చు చేసి వేయించినవి, తెలియవలసినది.

ద్వి ప ద.

శ్రీకర వనపర్తి సీమలోపలను - ప్రాకటమైమించె రామకృష్ణాఖ్య - పురమున వెలసె విభూతిచెన్నొంది - శిరికాటపట్టమ్మె చెలువొప్పునిలను - తత్పురవాసుడై దనరె వావిళ్ళ - కులపావనుడగు గుణగణ యుతుడు - లలిత లక్ష్మయ్య సాధ్వి రామాంబ - గర్భపావను డగుఘన ధురీణుండు - నిర్భరకలుష సందర్భ వారుండు - విమల పంచాక్షరి వేదాంతినామ - సుమతుల కన్నయై సొంపొందు బలుడు - దానరాధేయుండు దాక్షిణ్యయుతుడు - మహిని సిద్ధాంతినా మహితుండు దనరు- లలినొప్పు భీమవిలాసంబునచ్చు - కూర్పించె కీర్తిచే నేర్పొప్పగాను - కార్పణ్యములు లేనికవిజనులెల్ల - మెచ్చుచునుండ నిమ్మేదినియందు - సచ్చరిత్రుడని సరసాత్ములెన్న - ప్రవిమల కురుమూర్తి పరమాత్మ కృపనూ॥

ద ర్వు.

జనమేజయునకు కిట్లనియె వైశంపాయనుడుమునివరుడు తనమదిని ఘనమోద మొప్ప॥ సారది అజ్ఞాతవాసమునందు విరటుని పురమందు ద్రౌపతితరుణీమణికొరకై॥ గురిమీరగా సాముగరడిలో భీముడూ తెరవరూపము నబురుగొనియెకీచకుని॥ పరిపూర్తిగా జెప్పతరముగా దెవ్వరికని కురుమూర్తి వెంకటేశ్వరునకే తెలుసుగా॥

మాటలు. అనిన వైశంపాయనునికి జనమేజయుం డిట్లనియె. మునీంద్రా నీ మృధుమధుర భాషణంబులు వినగోరెద, సవిస్తరముగా దెలుపుమనిన వైశంపాయనుం డిట్లనియె.

కథా ప్రారంభము.

క॥ వేడుకతోడుత కౌరవు । లాడిరి జూదములు నప్పు డవనీ స్థలముగా ।
వోడిరి పాండవు లేవురు । పోడిమిచెడి సతియుదాము పోయి రడవికిగా॥

దరువు.

కోరికౌరవాపాండవులూ - ఆడిరి జూదములూ - మీరి కట్టిరిపణ ములూ వేలులక్షలు॥ కోరి॥

వర్ణన.

యాకౌరవులూ - యాపాండవులూ - జూదమూలు - ఆడిరి దొరలు - వోడిరి వారలు॥ కిడ్క॥

మాటలు.

గజతురగరథాందోళిక ఛత్రచామరాదులు ధరణి మొదలయిన సామ్రా జ్యము లెల్లను వర సింహాసనమున్ను కూడ జూదమందు జయించిన వారల కొప్పగించి, పన్నెండు వత్సరంబులు అరణ్యావాసమున్ను, ఒక సంవత్స రము అజ్ఞాతవాసమున్ను పోవలసినదని యీతీరు నాడిరి వినుమూ జనమే జయమహారాజ అవుననుమూ.

దరువు.

మదగజారథావళులూ - సుదతిమణులు హా వదలి పన్నెండు వత్స రములూ- అజ్ఞాతవాస మొకటి పదమూడబ్ధమూ లీతీరు పోలినవారు॥

వర్ణన.

మదగజమూలు - మదగజమూలు - రాజ్యమూలు - సుతసతీ మణులూ - దాసీజనులూ - పరసేవకులూ - మంత్రీజనులూ దండా దరులూ॥ కిడ్క॥

మాటలు.

యీతీరున ధర్మరాజు శకునిజేయు మాయ కృత్యంబు తెలియక వోడినవారై యేదియుం దెలియక.

దరువు.

దుగధచ్ఛిభారాయనియాడ - పాచికలతోడా - పగబూని శకుని తో నాడా ధర్మజుతోడా । కోరికౌరవా॥

వర్ణన.

దుగధచ్ఛిభారా - యని యాటలాడా - పాచికలతోడ - ధర్మజు డోడ - తమ్ములతోడ - వేగమెజాడ॥ కిడ్క॥

మా ట లు.

కడుపడిగా జూదమాడవలెనని సహజమున యెడలెరుగక అయ్యోడ పరవశుండై ధర్మజుడు చెడిపోదుననే తెలివి యుడిగి పడిన యనుజుల సహితంబుగ యోడినవాడై దుర్యోధనున కొప్పగించి యుండగా సిడిముడిగొని ద్రౌపతి ఝడిసి యోడినవారది నిజముగాదని యాజ్ఞజేసి పాచికలు కాలరాచి జూదమాడ నిల్పి యేవురి పతులగెల్చి.

ద రు వు.

పరివారములూ యెడబాసీ వనవాసము జేసీ - కురుమూర్తి శూచీ దలచి తమ్ములజూచీ॥ కోరీ॥

వర్ణన॥ కురుమతిరమణా - వేంకటరమణా - వేదోద్ధరణా - సన్మునిస్మరణా - ముక్తాభరణా॥ కిడ్క॥

మాటలు. సకలపరివారమను పృధివీమండలంబును మొదలైన సామ్రాజ్యంబును యెడబాసి మహావనవాసముకు సాహసముజేసి పదిరెండు వత్సరంబులుగడపి తీరిన దినములు లెక్కజేసి పదిరెండింటదెలిసి అజ్ఞాతవాసముకై యోచించి కురుమూర్తి గిరివరాధీశ్వరుని దలంచి విపినవాసము నిర్గమించి.

దరువు॥ తోంతతఝుణుదాధీంతతఝుణుతాదిత్తాదిముతత॥

సూత్రధారుడు విచారించు మాటలు. వచ్చినటువంటి వారెవరయ్యా స్వామీ హాహోహో.

ధర్మరాజు వేషము రావడము.

మాటలు. ఈ చతుస్సముద్ర మధ్యమండలంబందు గర్వోత్కృష్టులైన దుష్టరాజాధిపతుల జయించి శంకించ నీకుంభినీశ్వరులద్రుంచి యీభూమండలంబు అంబికాతనూద్భవున కొప్పగించి చంద్రవంశాధిపతులలో అధికుడనై మించి విరాజిల్లి అంబాలికాసుతుడు సుజనమనోహితుడు దిఙ్మండలాధిపతి పాండురాజుయొక్క జ్యేష్ఠపుత్రుండను మా నామంబులు వినుము భీమార్జున నకులు సహదేవులు వినుము నేను యుధిష్ఠిరుండను రాజదూత సకల సుగుణోపేత.

భీమసేనుని వేషము రావడము.

మాటలు. వరెవరె యీ పృధివీ మండలంబున దోర్దండమండితరిపుయుద్ధమండలంబులకుప్రచండమార్తాండస్వరూపుండనైనవైరిమదగజంబులకు

గండకేసరియైన చండహిడింబకుల బాల్యమందు గదాదండంబున మొదలార్చి యుద్దండంబుతోడ వెలసిన పాండుభూపతి పట్టంపు భార్యయైన కుంతితనూద్భవుండనైన విజితవిక్రమ పరాక్రమాభిరాముండను భీముండను రాజదూత జగత్ప్రఖ్యాత.

అర్జునుని వేషము రావడము.

మాటలు. ఈ ధరలో రిపుకులద్వీప సమూహంబులకు అకుంఠిత కంఠీరవుండనైన మేరుధీర పారావారాగంభీరసారా చమత్కారపరమోదార శృంగారకారుండనైన సవ్యసాచి కిరీటి భీభత్సు ధనంజయ విజయజిష్ణు శ్వేత వాహన ఫల్గున గాండీవి అర్జునుండను యీ పది నామంబులతో శ్రీ కృష్ణ పరబ్రహ్మ యనుగ్రహంబునకు పాత్రుండనైన దుర్జనుల నిర్జించు యర్జునుండను రాజదూత పటుగుణసమేత.

నకులుని వేషము రావడము.

మాటలు. వరె రాజదూతాగ్రణి యీ భూమండలములో ప్రఖ్యాతిచే స్వర్గమర్త్య పాతాళంబుల సూర్య వ్రాతంబునకు అధికుండనని ప్రసిద్ధిజెందిన శీతాంశులోద్భవులైన సుగుణసాంద్రుండనైన నకులరాజన వెలసితివి వినుమా వెస తెలుసు కొనుమా.

సహదేవుని వేషము రావడము.

మాటలు. యీ లోకమందు యిందుకులోత్పన్ను లయిన రాజాధిపతులలో యుక్తుండనయిన సుకుమారసుందర మృదుతరాంగ సౌందర్య సంపన్న సజ్జనుండను అతిప్రియముగలవాడయిన శ్రీ కృష్ణపరబ్రహ్మ నామ సహస్రంబులు నిరంతరంబు మనంబున ధ్యానించె విహిత సుగుణోపహారుండను సహదేవుండను రాజదూతవిహిత విఖ్యాత.

ద్రౌపతి వేషము రావడము.

రాగం - సాసాసాసారిససరీరీదపమగ.

సూత్రధారుడువిచారించుట వచ్చినటువంటిహా రెవరమ్మా హాహాహో ద్రౌపతి మాట. ఈ కుంభినియందు అంబుజసంభవజంబభేదిముఖ సుమనో విసరమునకు అంబరబింబాయమానుండయిన జాంబవతివరుడు సుందరగిరి ధరుడు శంబరారిగురుడు జాంబూనదాంబరవరుడు విడంబమహిమగలవాడు శ్రీకృష్ణమూర్తి భృత్యులయిన పాండవుల కర్ధాంగినైన ద్రౌపతిదేవిని గానా రాజదూత సుగుణవిఖ్యాత.



ధర్మరాజు యోచించుట.

దర్వు॥ ధర్మరాజానృపుడూ - యోచించెనపుడూ॥ ధర్మా॥ దుర్మదమనుజులతో మెలగుటకై॥ ధర్మా॥ తొలిగెవిపిన వాసామెల్లా - నిలిచేనో క్కా-అజ్ఞాతము హాహా॥ బలియులుశత్రులుకలత వెతుకుదురిక తెలియ గనుడు సుస్థలమెయ్యదియో॥ యోచిం॥

వర్ణన॥ యోచించెనపుడూ - యోచించెనపుడూ-తమ్ములకపుడూ-తెలిపెనపుడూ - ధర్మజూడూ॥ కిడ్క-తోకిణుతర్ఘుణుతా.

మాటలు. భీమార్జున నకులసహదేవాదులువినుడీ ఈసమయమందు మననామరూపంబులుదాచుకొని యుండుటకు స్థళము కనపడలేదు దొయందు కనిన యీపశ్చిమ దిగ్భాగమందు నిశ్చయముగా కర్ణవికర్ణులు భూమేలుతువున్నారు యింతెగాక ప్రాగ్దేశము మగధాదులు బ్రోతురు, మహాశూరులయిన కురురాజులు ఉత్తరదిశ పాలించుచున్నారు, మన ముండుటకు స్థళము యెక్కడ గలదు, అజ్ఞాతవాసమునకు యోచించి చూడదగినది మీ మనసులో నున్నది.

ఇందు భీముడనే దర్వు॥ యోచించగాయేలా మనకు - చూచిందాయూ తెలియమీకుహాహా॥ దాచుకదగినవిరాటునిపురమున - కీచకునిభయమును వెరతురు కౌరవులు॥ ధర్మా॥

వర్ణన॥ అన్నయ్యయోచన - యేలాయోచనా - యెందుకీయోచన-నీమనసూ - తెలియాయోచనా॥ కిడ్క॥

మాటలు. హేఅన్నయ్యా యిక్కడికి దక్షిణ దిగ్భాగమందు మత్స్యపుర మనే నగరమందు బలవంతుడైన కీచకుని బలముచేత అక్కడికి ధార్త

రాష్ట్రిలు రానేరరు నాయొక్కమాట మన్నించి అక్కడికిపోవుట వుచితము గాదా తెలియరాదా.

దరువు॥ ధరణీసురుడాధర్మాజూహా - వలలూడంద్రూభీముహాహా నరుడుబృహన్నలతురగ గోపతులుశ్రీ - కురుమతిహారికృపనరమాద్రిజులై॥



ద్రౌపతి ధర్మరాజుతో అనే దరువు.

ఘనమూగనుదీనియోచనజేయుటదియేమోవినగా దెల్పుముధర్మజా-కాంతావినగాదెల్పుము ధర్మజాహాహా॥ ఘనపరాక్రమాభీమార్జునులూయిరువురునుండ॥ ఘన॥

వర్ణన॥ కాంతాయోచనా - పతీయేయోచానా - యెందుకీయోచానా - యెక్కడిదియోచనా పాపమోచనా॥ కిడ్క॥

మాటలు. హే ధర్మరాజా తాము అజ్ఞాతవాసముకై చాలా ఆలోచన చేయుచున్నట్లు తోచుచున్నది హే కాంతా సద్గుణవిశ్రాంతా.

దరువు॥ అనుజూలుత్రిభువనామూలయందువిజయూలూ - అనగనూమునువినవా - అనువౌందమీయాజ్ఞాగొని - యెంతపనియైనాక్షణములో పలదీర్తురూహా॥ ఘ॥

వర్ణన॥ విడువిడుకాంతా - విడువిడుకాంతా - నీమదిచింత - జేయగకొంత - యాలనెవింత - యాశ్రమమంత - దగిలెనుస్వాంత - అయోధ్యా భగవంత - రుక్మిణి కాంత॥ కిడ్క॥

మాటలు. ఇదిగాక మీ అనుజులు భీమార్జున నకుల సహదేవులు

మహాబల పరాక్రమవంతులు త్రిలోకములయందు విజయము గలవారలై యుండగ యోచించ నేటికి నుమ్మాటికి॥

దర్వు॥ పది రెండు యేండ్లు యీ పగిది కాననమందు యొదిగివుండిన వేళలో - తదవాసమునా యేదైనారక్షించె తుదకు యాగవపతి తోడుమీా కుండగా॥ ఘన॥

వర్ణన॥ పదిరెండేండ్లు - పదిరెండేండ్లు - కాననమందు వుంటిమి ముందూ - అనుదినమందూ - హరిగోవిందూ - కృపతోనందు యీస్థల మందు - కృపయుంచు ముందూ॥ కిడ్క॥

మాటలు. అంతేగాక యీఅరణ్యా వాసమునందు పన్నెండుయేండ్లు నే మహానుభావుని యనుగ్రహంబుచే కడతేరితిమో తుదకు అజ్ఞాతవాస ము నొక సంవత్సరమును నా శ్రీ కృష్ణపరబ్రహ్మమూర్తియే పరిపాలించ గలడు నిజమని తెలియుడి నామాట వినుడి.

దర్వు॥ కరిరాజు మొరవిని హరియూతా చనుదెంచి - కరుణాతోడుత బ్రోవడా - పరమ భక్తుడవీవు హరిపాలన సేయూ కురుమూర్తి హరి గలడూ మనకిపుడూ॥ ఘన॥

వర్ణన॥ దయరాదా - కాంతా దయరాదా - యిది మరియాదా వేడగ లేదా - ప్రేమయు లేదా॥ కిడ్క॥

మాటలు. ఇంకా వక్క మాట వినుము గహనమందు కరిరాజు మక రిచే జిక్కి శ్రమనొంది హరినిగూర్చి మొరసేయగా అతి త్వరితముగా వచ్చి మకరి శిరము ద్రుంచెను తామైతె భగవద్భక్తి గలవారలు పరమ భాగవతోత్తములు మిమ్ము పరిపాలన సేయుట ఆశ్చర్యము గాదు. ఆ యోచన సేయగూడదు.



విరాటరాజు వేషము రావడము.

సూత్రధారుని మాటలు. వచ్చినటువంటి వారెవరయా స్వామి హాహో.

విరాట్రాజు మాటలు

వారెవరె రాజదూతాగ్రణి క్షత్రియ సముదాయమునకు భయంకరుడైన యీ ధాత్రియందు క్షత్రియులలో నుత్తముడనైన వాజీవారణ స్యందనాందోలిక ఛత్ర చామరాదులచేతను శోభితుండనైన యీమత్స్య నగరమునకు అధిపతినైన విరాట భూవరుడను గానా రాజదూతా వటుగుణ సమేత॥

సుధేష్ణ వేషము రావడము.

యాశ్వర్యమైన సింహాసనమునకు పాత్రుడయిన మందమతులయిన శత్రుకులముల నిర్జించి ప్రకాశించి కడుధీరుండయి బడుగు జనములకు కడుపునకు కడుపునిడి తొడుగ వస్త్రంబులిచ్చి బ్రోచుటకు కల్పవృక్ష మయిన భోగమందు అమరేంద్రుడయిన శత్రువులకు అరవింద బాంధవ నందనుండైన విరాటరాజాధిపుని అర్ధాంగినయిన సుధేష్ణదేవిని గానా రాట్దూతా కింకరజనాధినేత.

వ. తదనంతరము పాండవులు జమ్మివృక్షమునకు పూజించుట.

దరువు॥ అమ్మా వినవె జమిమ్మా కొమ్మ మామనవి గై కొమ్మా మామనవి విల్లానమ్ములు జిమ్మా కొనవమ్మా॥ అమ్మా॥ నేను అర్జునుడూ పింపాసగానడిగితేయిమ్మా - కానిపరులకు మిగుల గనుపడ తగదమ్మా॥ అమ్మాయిలలో అర్జునుడు మిక్కిలి వలగొనిపూజించి- కులదైవముగ మిమ్ము గొలతురుగదవమ్మా॥ యిరవొందగ అజ్ఞాతావర్షము యిత్తరి జరిపి కురుమతి శ్రీహరి కృపచే కొనిగెదమమ్మా॥ అమ్మా॥

మాటలు. హే శమీవృక్షమా ఈ యజ్ఞాతవాస మొక సంవత్సరము విరాటనగరమందుండి తదనంతరము మిమ్ము పూజించి ధనురాది సాధనంబులు గొని చనియెదము మిగుల స్తుతియించెదము.

వ. అందుకు భీమునకు కోపము సంఘటిల్ల ద్రౌపతితో అనుట.

గీ॥ తాము ధనువులుగొనగ స్వతంత్రులగుట । నేను పరతంత్రుడుగనుండు టేమివింత । కాని తెలియదు యిటువంటి కౌతుకంబు । వింటివే సాధ్వి ద్రౌపతి విమలనేత్రీ॥

మాటలు. హే ద్రౌపది తాము ధనురాది సాధనంబులకు స్వతంత్రు లగుట నేను అస్వతంత్రుడ నగుట తోచబడెను. మొన్న సభలో దుశ్శాసనుండు నిన్ను తోలుకవచ్చి వస్త్రాపహరణము సేయు సమయమున వారి ఆజ్ఞాబద్ధులమయి యుంటిమిగాక ఆ సమయమందు అగర్వ ఖర్వ దుర్వారులయిన నూరుగురు దుర్యోధనాదుల పట్టి పట్టున చీల్చి కరిపుర ద్వారంబులకు హారంబులు శాయకుందునా వూరకనే వుందునా తాము మహావీర యోధులయినట్టు నేను అనాధనైనట్లు తోచుచున్నది హే కాంతా సద్గుణ విశ్రాంతా.

ద్రౌపది॥ క॥ శ్రీమహితసకల సుగుణో। ద్ధామప్రతాపాభిరామదాన వనారదో । స్సీమానువిపులతరబల। భీమా పరాక్రమను నామ భీమ లలామా॥

మాట. తాము అజ్ఞాతవాసము చిత్తగింపవలసినది యెందుకనిన తాము అతిపరాక్రమాభి విక్రములనిన్ని అతికోపోద్దీపిత మానసముగలవారలనిన్ని యోచి యీరీతిగ నుడివినారు వినుమూ యిందుకు సంశయింప పనిలేదు అతివిక్రమ పరాక్రమాభిరామ సుగుణస్తోమ.

వ. పంచపాండవులు మారువేషముధరించి విరటుని పురమునకు బోవుట.

దరువు॥ కంకుడాయను ధర్మరాజుడింకాభీముడువంటకు - శంకిలకా వలలునామముతోనపుడూ॥ కంకూ॥ హయగోపరివృఢులైరీ - నియమము తోమాద్రిజులు - సయముతో ద్రౌపదీ - సైరంధ్రియయ్యె॥ కంకూ॥ తొలుతా స్వర్లోకమునా ఆ వూర్వశి శాపంబుచే - యిలలో అర్జునుడూ బృహన్నలతానయ్యె॥ కం॥ మురహరుని స్మరియించుచు విరటుని పురమున కేగగ - ధరణీశుడువారల చరణములకు మ్రొక్కె॥ కం॥ యిరవొందగ కురుమూర్తి గిరివరమందిరుడైన - హరికృపచేనుండిరీ కరుణతో నపుడు॥ కంకూ॥

వ. విరాటరాజు ధర్మరాజును సన్మానించుట.

మా. ధన్యుడనైతినిస్వామి మిమ్ము పొడగన్న మాత్రాన మున్ను నేజేయు జన్మజన్మాంతరపాపములు నన్నువిడచిపోయెను నాపుణ్యావశంబున మిమ్ముపొడగంటిని సన్నుతించెదను మీరున్న స్థలమెయ్యదియో తెలుప వగు తపోనిధాన మూర్తివిశదసత్కీర్తి.







## ధర్మరాజు విరాటరాజుతో అనే దర్వు.

దంతినగరీధర్మరాయునీ చెంతనుండుదుమూ॥ దంతి॥ కుంతిసుతులా గొలిచిమేమూ- కొంతదినములు గడిపి పిదప॥ దంతి॥

వర్ణన॥ వినురాజా - దినకరతేజా - కవివరభోజా - కల్పభూజా - వినుమహారాజా॥కేడ్క॥

మా. కరిపురాధీశ్వరులు మా శిరంబుననున్న వార యిక్కడికి రావడమునకు కారణ మేమనిన తెలుపుదువిను రాజా రవికోటి తేజా.

దర్వు॥ వొక్కదినమూ కౌరవాదులూ - పాండునందనులూమక్కువతో నాడిరిజూదములూ - యెక్కువైనరాజ్యమోడీ - నిక్కముగ సోదరుల గూడీ - అక్కజముగా వనమునందూ - పెక్కుదినములుండిపిదపా॥ దంతి॥

మాటలు. చూడగను కపటమునను ఆడిరట జూదములు వోడిరట రాజ్యములు పూర్తిగా వినుము రాజా యిందునిభ తేజా.

దర్వు॥ రెండు ఆరు యేండ్లువిపినములో - పండియు మేముండగనూ- యేభూమండలమునా కేగినారో - యెందు అజ్ఞాతముకొరకై పాండుసుతులా గానమైతిమి॥ దంతి॥

మా. క్షత్రియోత్తములు కుంతి పుత్రు లేవురు నర్ధరాత్రియందు మేము సుషుప్తిజెందివున్న సమయమున యెందు బోయినారో తెలియదు నందనందనునకే తెలుసును వారిని వెదకుచు యిందు వచ్చితిమి యిందులేరైరి నేడూ మముకరుణ జూడు.

దర్వు॥ మరుగు వేషమూలతో బోగా తెరవా సహితముగా - గురుతులూ దెలియాకుండగా బాగా - నరిగిరీ యీ కరణియనుచూ ధరణి మెల్లా గ్రమ్మరినీ - పురమునా కేతెంచితిమీ - కురుమతి శ్రీ హరికి దెలుసును॥ దంతి॥

మాటలు. హే విరాటరాజా వినుము రాజసేవ దొరకక మేము భోజనము సేయువారముకాము సహజమిది మాధర్మము పరులకు తెలిపితే నిది ఆశ్చర్యము తోచబడును యీ జగతియందు మమ్ము రక్షించేవారల కానమయ్యా యిది మా ధర్మమయా.

విరాట ధర్మరాజుల వాదం దర్వు.

ధరణీసుర యేవురు నుండుడి మీవర మందిరమందూ యిందూ - యిరువుగ యీ నలుగురికి నరచిదీ యేకార్యములందూ యిందూ॥ ధర॥

మాటలు. వరకంకార్యులవారు వినుడి మా మందిరంబున నుండుటకు యీ నలువురికి నేమికార్యమందు పరిశ్రమ గలవారలు తెలుపదగు తపోవిధిమూర్తి విషదసత్కీర్తి.

ధర్మరాజు దర్వు.

పాకచమత్కృతి ననేకవిధంబులవీక నొనర్చును రాజా రవి తేజా - గోలహాయశిక్షకులుగనీ యిరువురి చేకొనదగు రాజాను తేజా.

మాటలు. హే విరాటరాజా వినుము మున్ను పాండవులకడ నుండు కాలమందు పరిపరిభక్ష్యాన్నాదులు జేయుటయందు భీమునకు సైదోడండ్రు వీని నామము వలలుడండ్రు యీ కలియుగమందు నలరా జనవచ్చును యీతడు నాటకాలంకారముల యందు నలరా జనవచ్చును వినుమూ వీని గనుగొనుము యితడు నాటకాలంకారములయందు విద్య ప్రవీణత గలిగినవాడు తక్కిన యీయిరువురు హాయగోపరీక్షకులు నేను సర్వశాస్త్ర నీతి పురాణములచేత ధర్మయుక్తమయిన భూసురసన్యాసంబు వహించి కంకార్యులమైనాము వినుము వెస తెలుసుకొనుము.

దర్వు॥ ఘనముగమీమన్ననకు పాత్రులము అనవరతము రాజా కవి భోజా - ధనకనకములందున మీసరి అనవరతము రాజా - కురుమతిహరి మమ్మిటు తగ బ్రోచును యిరవొందగరాజా॥ ఘన॥

ద్రౌపదిదేవి సైరంధ్రి వేషము ధరించి సుధేష్ణ చెంతకు బోవుట.

క॥ ఆపాదమస్తకము త । ద్రూపము నీక్షింపుచును గుతూహలమడరన్।
భూపాలమహిషియిట్లను । నా పొలతుకతోడ నుచిత మర్యాదుభంగిన్॥

సుధేష్ణ అనుట. గీ॥ ఏదికులము నామ మెయ్యది యెవ్వరి। దాన వేమి పనికిబూని యిప్పు। డెచట బుద్ధిదలచి యేగెద వింతయు। నెరుగ జెప్పు మాకు మెరుగుబోణి॥

ద్విప॥ రాజీవముఖి యింద్రు రాణివో నీవు - తేజమింతని జూచి తెలుపంగ రాదు - సురయక్షగంధర్వ సుదతివో లేక - నర యక్షకిన్నెర నాగాంగ నావో - పరికింపగాను మా పరమేష్టి సతివో - యిరవొంద శ్రీహరి యింతివో లేక - హరుని యిల్లాలివో యతివరో నీవు - మరునిరాణి వోచూడ మరిచోద్యమయ్యె - యెందుండి వచ్చితి వెందుబోయ్యెదావో - యిందురా పనియేమి యిందీవరాక్షి - పేరేమి వూరేమి పెనిమిటి యెవ రూ - సారె కులాచార సద్ధర్మమేమీ - నినుగను గొనగానె నెనరుప్పతి ల్లె - అనుమానమును మాని అతిశీఘ్రముగను - వినగదెల్పవె కొమ్మవే డుకలిమ్మా.

దరువు॥ చెలియాబల్కవెచంద్రవదనా - నాచెలిమితోడనుకుందర దనా॥ చె॥ తలిరాకుబోణి నీకులమేమి స్థలమేమి - యిలగృమ్మరిలను మిక్కిలిచోద్యమయితోచు॥ చెలి॥ పతిసుతహితులు యెవ్వారు - యీ క్షితియందుకలిగివున్నారూ - అతిరూపవతివి వక్కతివిరాకతమేమో రతివో పార్వతివో ద్రౌపదివో చిత్రమ్మయ్యె॥ చెలి॥ అనుమానము విడనాడూ - నాతో అనువొందగనుముచ్చటాడూ - కనుగొనినంతనె మనుసుసంతస మాయె॥ చెల॥ సరసిజాననజాగు లేలా - యింతవెరుపేలనే ముద్దుబాలా యిరవొందగాను శ్రీకురుమూర్తిహరిబ్రోచూ - తరుణియీధరణి నీకరణి రాబనియేమి॥ చెలి॥

మాటలు. హేఉడు రాజముఖి వినుము తలిరుపాదములు చిలు కలువలె పలుకులు అరటులదోలుతొడలు లఘువుగలలేడి చూపులు ధనువులబోలు కనుబొమ్మలు యింద్రనీలములదెగడు ముంగురులు పగ డంబులమించు యధరంబు కుందకుట్మలంబుల గేరు దంతంబులు గలిగిన దానవు యిక్కడికి రావడమునకు పనియేమి నీనామమేమి కన్యాకులమణీ సౌందర్యశిఖామణీ.

ద్రౌపతి తన వృత్తాంతంబెల్ల సుధేష్ణతో దెలుపుట.

మాటలు. హే సుధేష్ణామణీ వినవమ్మా సైరంధ్రిజాతి సంభూ తను మాలినియను నామంబు గలదానను వినుమా విరాటభూవరుని కొమ్మా.

సుధేష్ణ మాటలు. హే భామామణి సైరంధ్రిజాతి యనగా మాలిని యనగా యేజాతి యే నామమో సక్రమముగా దెల్పవె కొమ్మా బంగారు బొమ్మా.

సైరంధ్రి అనుట.

శ్లో॥ సైరంధ్రిపరవేశ్మస్తా - స్వవశాశిల్పి కారికా ఇత్యమరః॥
టీక. గంధలేపనమున్ను తిలకనిర్మాణమున్ను మొదలయిన పనులు జేయుచున్న స్త్రీపేరు తెలిసి వినుము నిలచి గనుమా.

ద్విపద॥ వినవమ్మ సుధేష్ణ విన్నపంబొకటి - మునుపాండవులు జూదమాడినపిదప - వనమునపన్నెండు వత్సరములుండి - చనిరి యజ్ఞాతవాసమునకై విన్న - పాండవులేవురు పణతిద్రౌపతియూ - నిండురాత్రివేళ నెటుబోయినారో - ద్రౌపదిదేవిని తగ వెతుకు కొనుచు-ఈపురంబునకిపుడు నే తెంచినానూ॥

దరువు॥ మందగమన సైరంధ్రినేని గృహమందు నుండగ వచ్చితీ
పల్లవి॥ సుందారి ద్రౌపతియందు సేవకురాలై-యుందూ నేనందూముందూ-యేమందూ॥ మంద॥

వర్ణన॥ వినువినవమ్మ - విరటునికొమ్మ బంగరుబొమ్మ - కాంతులు జిమ్మ - రతనపుబొమ్మ - సరిలేదమ్మ - మనవినమ్మా॥ కిడ్క॥

మాటలు. హే మందగమన సుధేష్ణామణీ వినవమ్మ మనవిచేకొమ్మ చంద్రవంశాధిపతులైన పాండవుల అర్ధాంగియైన ద్రౌపదీదేవికి యింపొందేటట్టుగా సేవకురాలనై వుందు నేనందుముందు.

దరువు॥ అడవిలో ద్రౌపదిపణతి వెంబడి నేను పుడమిసంచరించితీ నడురాత్రియందు కెక్కడికేగిరో వారూ - కదువాడిగావచ్చితీ యిటు జొచ్చితీ॥ మం॥

వర్ణన॥ తెలిపేదనిందు - ద్రౌపది యందు - సన్నిధినందు వుంటినిముందు - యేమనెందు శ్రీహరినిందు - స్తుతియింతుముందు॥

మాటలు. నిన్నటిరాత్రియందు ముందున్న విపినవాసమునందు పాండవులకు యెన్నగా పన్నెండువత్సరంబులు నిండుట తిన్నగాగురించి అజ్ఞాతవాసము జరుపగావలసి ద్రుపదనందనయైన ద్రౌపదిదేవిని మున్నిడుకొని పతులేవురున్ను కన్నుగవదెరచి చూచినంతలో వారలు గనిపించనందున వెదుకుచు వచ్చితినమ్మా విరటుని కొమ్మా.

దర్వు॥ ఈసమయమునాన న్నే లెదవని చాల ఆసించుకొనియుంటినే - దాసినయ్యేదను నిరాసింపకుండితే - వాసి కెక్కేదనంటినే వాల్గంటిని॥ మంద॥

వర్ణన॥ దయారాజుడు - దయారాజుడు - నాపై నేడు - కరుణారాజుడు - వినువిను నేడు - శ్రీహరితోడు - దెలిపెద నేడు॥ కిడ్క॥

మాటలు. ఈ సమయమందు నిరీక్షించక గ్రాసమొసంగి పోషించి నట్టయిన దది రెండువత్సరంబులు నీదాసినై యుందు నీగృహమందు.

దర్వు॥ నిరతాము కురుమూర్తి గిరిశ్రీనివాసుని - మరువాకనిలచేదనూ - కరుణించి బ్రోవు యిత్తరిని బంగరుబొమ్మ-సుతసోదరుల కెల్లసుకృతాముగదవమ్మ॥ మంద॥

వర్ణన॥ విరటునియునతి - విరటునియువతి - వినవే నాతి - విశదఖ్యాతి - నామదిరీతి వుండుదు నాతి - సద్గుణయువతీ॥ కిడ్క॥

మాటలు. హే సుధేష్ణామణి వినవమ్మ నీ గృహమందు పరిచర్య జేయుచు నుందునమ్మా ముద్దుగుమ్మా.

సుధేష్ణ అనే దర్వు॥ కొమ్మరో వినుమా - యమ్మరో గనుమా - సమ్మతంబు గాను సంతసించుమా॥ కొమ్మ॥ చింతాబాసి మా చెంతనుండుమా - యింతీపూలబంతీ సౌఖ్యమూ గనుమా॥ కొమ్మ॥ పున్నమా చందు్రనీబోలునీముఖమూ - వన్నెలాడినిన్ను గన్న కోర్కెదీరు॥ కొ॥ భూమికురుమతి ధాముకభిమతీ - భామయిందునుండు భయము బాసియుందు కొమ్మ॥

మాటలు. హే సైరంధ్రిరమణి వినవమ్మ వెరపులేక నా మందిరంబున సుఖంబున నుండవె కొమ్మా.



కీచకుని వేషము రావడము.

దరువు॥ తోంతతరఝుణుతాదీమ్తతరఝుణుతాధీత్తాతీమత॥
సూత్రదారుని మాటలు. వచ్చినటువంటి వారెవరయా స్వామి హాహోహో.
కీచకుని మాటలు. వరెవరె పరివారముతో వచ్చి కరములు మొగిచి అతిఆశ్చర్యముగా విచారించెదవు నీవెవ్వరో తెలుపుము వేగచెప్పెదను బాగ
సూత్రధారి మాట ఇచ్చట ముచ్చట లరయవచ్చిన వారల నెచ్చరించుచు రాజాజ్ఞచే యిచ్చటనుండెడి సారథినిగానా తామెవ్వరో తమనామధేయం బెద్దియో శీఘ్రముగ దెలుపుడి నామనోవాంఛ దీర్పుడి.
కీచకుని మాటలు. ఈ పుడమియందుండు రాక్షస సముదాయము నకు కిరీటియైనవాడును మదించి హుంకరించి నాయెదుట సంచరించె, గర్వోత్కృష్టులైన శత్రురాజుల మదమణంచి మేలు వుద్దండప్రకాశుల నిర్జించే వేళ రక్షించేవారెవరు పరమేష్టి చక్రాదుల పురములుపట్టి యూచి చూచెను ముక్కంటికి తెలుసు నాబలము రాజదూత జగత్ప్రఖ్యాత.
వరె యీపుడమియందు కడువడిగా ఝుడిసి భవాండములు పొడి పొడిగాగలవు గడగడవణకి తడబడి శిడుముడిగొని దృఢము జెంది బెగ్గరిల్లి మిడిసిపడ రవిచంద్రులు తావులుదప్పిరి వినుమూ నాసాహసంబు గనుమూ.
యింతేకాక వుద్భట పరాక్రమము యొక్క రాజకులమనె పర్వత సముదాయమునకు దిట్ట వజ్రపాణినైన కరిశిరము భేదించె కేసరియైన యీ ధారుణిలో వైరిరాజుల నడంచి విరాటునకు కానుకలొసంగ జేసిన కడు ధీరమతినైన కీచకుండను నానామంబు వినుము, రాజదూత జగత్ప్రఖ్యాతా.

కీచకుడు సుధేష్ణతో అనే దరువు.

క్షేమమాధామమందూ - అక్కయ్య ప్రేమతోదెల్పుముందూ - యిందూ॥ క్షేమ॥

వర్ణన॥ అక్క క్షేమమా - అక్క క్షేమమా - మీరలు క్షేమమా - బావా క్షేమమా - వినవినవమ్మా - తెల్పవెకొమ్మా॥ కిడ్క॥

మాటలు. హే మానవతి అక్కయ్య వినుము. మీధామమందు సర్వులు క్షేమమేనా - అరసి నేడు కరుణజూడు.

దరువు॥ ఉత్తరోత్తరులుయందూ పోయినరు - యెత్తుకొని తెమ్మనిందూ చిత్తమిటునైపదిందూ - నామదితత్తరము శాంతినొందూ - యిందూ॥ క్షేమ॥

వర్ణన॥ ఉత్తరోత్తరులు - చిత్రజాలకులు - వుత్తమమతులు - ప్రజ్ఞాన్వితులు - చిత్తజప్రబలులు - రాజాన్వితులు॥ కిడ్క॥

మాటలు. ఉత్తరోత్తరులు యెందుబోయినరో యిందులేరు సందేహింపక ముందు నీనందనుల గనుగొందు ఆనందము జెందుదు సర్వబంధువులు కుశలమేన తెలుపు గాన.

దరువు॥ వుడురాజ బింబాననా - వయ్యారి నడురాజ గజగామనా కడుబెళుకుచూపులలనా - గనుగొన్న యెడ నాదుమదినిలుచునా॥

వర్ణన॥ వినవినవమ్మా - యిదియెవతమ్మా - బంగరుబొమ్మ ముద్దులగుమ్మ - కాంతులుజిమ్మా - చక్కెరబొమ్మ - చక్కనికొమ్మ సరిలేదమ్మ - యీసతికురులు - యీ సతికురులు - తుమ్మెదగములు తెరవాతొడలు - అరటులబోలు - యీసతిచనులూ లికుచాములు పణతికనులూ - కలువలబోలు॥ కిడ్క॥

మాటలు. అక్కయ్యా నీ ఆలయమందు నొక్కమదించిన యేను గను దిక్కరించె నడుపు గలిగిన యీ జగతియందు అధిక లావణ్యసుందరి శిఖామణి యిది యెవతి దీనివుభయ కుచమధ్యమందు నావుల్లంబుజిక్కిరాదేమిసేతు దీని ద్వంద్వకుచ ఘురువంబుచే నశియించెనో విరహసంతాపాగ్నిచే కరిగెనో దీనిలావణ్య సుధాసముద్రమందు మునిగెనో దీనివయస్సనే కాంతారంబందు మన్మథుండనే తస్కరుం డపహరించెనో నాకు ఆశ్చర్యము తోచుచున్నది అక్కా నాయందు అక్కరదలంచి నన్ను దక్కించుకొనవలెను దీనినా కొనగూర్పవలెను.

దరువు॥ తరుణియిరుకుచములందూ - నామనుసు యిరువుకొనితిరుగదిందూయిందూ - బిరుసుతొనరిగి కరిగినదోమందూ - కురుమూర్తి హరినెరుగ జేమనందూ - యిందూ॥ త్వేమ॥

వర్ణన॥ యీసఖిమోము - చంద్రునిసమము - తెలిపెద వినుము - నామనవినుమూ - నన్నుగను గొనుమూ॥ కిడ్క॥

మాటలు. యీయింతి కళంకరహితమయిన రాకేందుముఖి సొగసు వయ్యారి మన్మథునిచేతి కఠారి విజితగడగమనకలకంఠికమలనయన దీనినా కొనగూర్చు నామది సంభ్రమముదీర్చు.

సైరంధ్రి సుధేష్ణతో అనుట.

దరువు॥ వచ్చినవారెవ్వరెకొమ్మా - నచియింపవమ్మా॥ ప॥ చూచియుతముదాచకచై జాచియు దుర్వాచకముల - కీచకుడని పలుకగాదగునా రాచవాడలోనా॥ వచ్చి॥

వర్ణన॥ చూడుచూడు - చులుకనివాడు పైబడువాడు - చెడిపోతాడు - సీతమ్మాడు - తెలియగలేడు - దుర్మార్గుడు॥ కిడ్క॥

మాటలు. యీ రాచనగరిలోపల సతులజూచి నిలువనోపక నీచవాక్కులు బలుకుట కీచకునకు వుచితమేనమ్మా కూడదని తెలుపతగునమ్మా.

దరువు॥ ఇంతిరో బలవంతులు నాకాంతులు గంధర్వులేవురు - దృంతురనుచు తెలియగబోడూ - విభ్రాంతుడీడు॥ పచ్చి॥

వర్ణన॥ వినునాపతులూ - వినునాపతులూ - విలసితమతులూ - బలసంయుతులూ - దేవా కృతులూ - దుర్జనహతులూ - గంధర్వాలూ॥ కిడ్క॥

మాటలు. ఇంతేగాక నాకాంతులు మహాబలపరాక్రమ వంతులు గంధర్వులు యేవురుగలరు దుర్మదులదృంచి వేతురు తెలియజాలడు వ్యర్థముగా చెడిపోగలడు.

దరువు॥ గురుతరముగకురుమతి శ్రీహరినినమ్మి తరుణియనుచు గురుతుగనీవైన తెల్పవె తరముగాదనవు॥ వచ్చి॥

వర్ణన॥ వినువినునాతి - పీనికిసీతి - లేదెఖ్యాతి - తెలుపుమురీతి - యిదిప్రఖ్యాతి - కురుమతిహరినె - కురుమతినె - నమ్మితిమదినె యిటులనడగునే॥ కిడ్క॥

మాటలు. శ్రీకురుమూర్తి హరిని నిరతము నమ్మిన తరుణీమణి యని తెలుపదగునమ్మా బంగరుబొమ్మా.

సుధేష్ణ కీచకునకు బుద్ధి జెప్పుట.

దరువు॥ శోకవరాళి॥ పరనారీమణులాయీ పగిదిమోహించుట తరమేమన్నా - శిరియునాయువుదీనాక్షీణించుతమ్మాడ తెలియవన్నా॥ ప॥

వర్ణన॥ వినువినవన్నా - యిదితగదన్నా - పరస్త్రీయన్నా యెవ్వరువిన్న నవ్వేరన్నా - నామనవివిన్నా - మేలగునన్నా॥ కిడ్క॥

మాటలు. పరస్త్రీదోషముచేత బహుమంది హతమై పోయినారు పరస్త్రీల గవయుట పరద్రవ్య మపహరించుట పరనిందలు సల్పుట యీ అపరాధులకు దూరమౌదురని పెద్దలు బలుకుదురు వద్దుపోవన్నా బుద్ధివినవన్నా.

దరువు॥ అందారివలె నొక్కఆడుదానికి యింతాయెందుకన్నా - గంధర్వులేవురు గలరు దీనికిపతులు తెలియవన్నా॥ పర॥

వర్ణన॥ వినువినురోరి - యిదిపరనారి - మనసిటుగోరి - చెడకురోరి దోషకారి దుష్టాచారి - యాలర వోరి॥ కిడ్క॥

మాటలు. యీలోకమందు అనేకస్త్రీలుగలరు అందరివలెయిదివక్క ఆడది యిదిగాక గంధర్వులసతి యిది యందరవలెకాదు మందర యమ దండనకు లోబడకు తమ్ముడా చెడకు.

దరువు॥ కన్యాదాసీలునీకూయెన్ని కావలసినా వున్నారన్నా - అన్య భామలబొంది హతమయ్యి బోవుటయెందుకన్నా॥ కన్యా॥

వర్ణన॥ నాగృహమందూ - కోరినవిందూ - వున్నారిందూ- నీమన సందు - కోరిమియిందూ - చూడుమియిందూ - యీచెలులందూ॥ కిడ్క॥

మాటలు, అనుజా నా మందిరంబులో నీవపేక్షించిన వారల అను కూలించెద వినుమా సుఖము గనుమా.

దరువు॥ ఇచ్ఛలేనియింతినెనయాగ అపకీర్తి వచ్చునన్నా - అచ్యూగ కురుమూర్తి - హరియునీమాటలు మెచ్చడన్నా॥ తర॥

వర్ణన॥ దీనిపతులూ - బలసంయుతులూ - దేవాన్వితులూ- ప్రజ్ఞాన్వితులూ గంధర్వులూ - విలసితనుతులూ॥ కిడ్క॥

మాటలు. వరె మూఢ యిచ్ఛలేనటువంటి మచ్ఛకంటిని గోరితె వచ్చును అపకీర్తి మెచ్చడు కురుమూర్తి అచ్యుతుడు పూర్తి.

కీచకుడు సుధేష్ణతో అనుట.

దరువు॥ భామామణియీమానిని - కామించితిభోగింపగ॥ భా॥ ప॥ నోమునునోమినా నోముఫలింపగ - వేమారును నామానసమేమారక కాముడేసె॥ భా॥ అక్కరో యీచెలి చక్కనిదానిగనీ- నిక్కముగనక్కా ముడు - తిక్కమొగమొక్కాజేసె॥ భా॥ చానమొగముడాలు చంద మామనుబోలు - దీనిబోలుదాని పనిబూని దివిగానిగన॥ భా॥ భూమిని కురుమతిధాముసకభినుతి- ప్రేమామున నామానసకామములుదీరజేతు॥ భా॥

సుధేష్ణ కీచకునకు తిరుగా బుద్ధి జెప్పుట.

దరువు॥ మన్నించినామాటవినుమా అన్నా యింటికిజనుమా - ఆపతి వ్రతను నీవాసింపగబోతె పాపమగ్గలమాను గనుమా॥ అన్నా॥

వర్ణన॥ అన్న వినరా అన్న వినరా - నా యన్న వినరా యింటికి జనరా - యిది హితమటరా - తెలిపెద వినరా - తమ్ముడ వినరా॥

మాటలు. తమ్ముడా వినుము. ఆమె మమ్ము సేవించినది అత్యాచార ముగా మాటలు బలుకకుండుము నిక్కముగ వక్కసారియైన యీమెకు

పనిచెప్ప మేమే వెరతుము. నీ మనస్సునకు తెలియక మదోన్మత్తత చేత యీ మెను యీలాగు బలుకుట మరియాద కాదు, దుష్టా, పరమ పాపిష్టా.

దరువు॥ దుర్మార్గులను యమధర్మాడు శిక్షించు దుర్మార్గ మిదియాల యాలవినుమా - అన్నా యింటికి జనుమా॥ మన్నించి॥

వర్ణన॥ దుర్మతుడంచూ - యెముడు నెంచూ హరిశిక్షించు తెలి పెదనంచూ తెలిపెదవినుమూ - సుఖమూ గనుమూ - నన్నూ గనుమూ॥ కిడ్క॥

మాటలు. వరే దుర్మార్గ వినుము. ఈ ధారుణియందు దుర్మార్గుల యిన పురుషులను యముడు శిక్షించును నీవాపె నపేక్షింపక జనుమా నా మాట వినుమూ.

దరువు॥ పరసతిబొందిన దురితాము లేతెంచూ - కురుమూర్తి హరి మెచ్చవినుమా - అన్నా యింటికి జనుమా॥ మన్నించి॥

వర్ణన॥ హరిమెచ్చడూ - హరిమెచ్చడూ - శ్రీహరి మెచ్చడూ - మతిలో మెచ్చడూ మతిలో మెచ్చడూ శిక్షించగలడు - వినునాతోడు - బ్రోవగలడు॥ కిడ్క॥

మాటలు. బలాత్కారము చేత పరసతులను బొందిన పాప మగ్గల మానూ వినుము నేడు తెలిసి చూడు.

సుధేష్ణకు కీచకునికి వాదం దరువు.

కీచ॥ అక్కరో వినుమా - అతివరో గనుమా - పెక్కు మాటలాడ నీకు ప్రియము గాదమ్మా॥

సు॥ అనుజా వినరా - ఆత్రమేలరా - మనసు నిల్పజాలవింత మరు లుచాలుర॥

కీచ॥ యింత చక్కనీ యింతినీ గని - మంతనమున నోర్వజాల మానినీమణి॥

సు॥ గరుడగమనునీ కురుమతీశుని - నిరతము మది మరువకాను స్మరణ జేయుమా॥

తిరుగా కీచకుడనె దరువు.

నెన్ను జెప్పిన విననమ్మా - యీ వన్నెలాడిని విడువా నమ్మా॥ ప॥ మన్ననతోడ నీ సన్నిధిలోపల వున్నందుకే నేను నిన్ను వేడితిగాని॥ యె॥ నెంతో చక్కనిదీ ఈ యింతీ - మరునికాంతినగూ పూలబంతీ - మంతాన మునకు నామందిరమున నుంచె - కాంతలలోన మన్నింతు యీ కాంతనూ యెన్ని॥ నిలుపజాలని మోహమాయే - ధైమెము తెలుపరానిది చిత్రమా

యే - అలుకపడక నన్నూ ఆదరించవమ్మా - తెలుపుదు కురుమూ ర్తి తెలిసేటట్లుగ నీకు॥ యెన్ని॥

వ. కీచకుడు సైరంధ్రిపై మోహముచే తత్తరపడి ఆ సుందరీ మణిపై బడు సమయము గురుతెరింగి సుధేష్ణ కీచకునకు మరుగు మాటల చేత నీ తావునకు పంపించగలనని నుడివిన కీచకుడు పోయిన తదుపరి ద్రౌపతితో యిట్లనియె.

దరువు॥ పోపోగదే - పోగదే సైరంధ్రి వేగా॥ పో॥ దాపురమైనాను రా దాచుకరాగా వేగా॥ పోపో॥

వర్ణన॥ వేగమేపోవే - సురగొని తేవే - అమ్మయ్య పోవె బరువడి రావె తడువేలపోవె - నామన వినవె॥ కిడ్క॥

మాటలు. పణతి సైరంధ్రీ జనశిరోమణి వినుము నా తమ్ముడైన కిచకుని సదనమునకుబోయి ఈ గిన్నెలో సురగొనితేవె మధురవాణి పున్నాగవేణి.

దరువు॥ రత్నపుగిన్నెలోన అతిమధురాపూసురా - జతనముగానూ దేవె అతివ సైరంధ్రివేగా॥ పోపో॥

వర్ణన॥ పిలచినచాలా - పిలచినచాలా - పలుకవేలా అల గుటమేలా తెలుపవెబాలా - వలువదుహేల - నిలుకడలేలా జే యగమేలా॥ కిడ్క॥

మాటలు. వజ్రవైడూర్య నీలగోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య స్థగిత్తమైన యీ చషకములో మిక్కలి అమృతతుల్యమయిన మదిర పదిలముగదేవే మదకరిగమన యిందునిభ వదన.

దరువు॥ ఘడిఘడియూకూ నోరూ తడియుడిగీ నాదికా- నిడిదిగూడదను వేగా కడువడినడుగిడూ॥ పోపో॥

వర్ణన॥ దయరాద - దయరాద - నామీద దయరాద - వేడగ లేదా - కొనియాడగలేదా - నాతో వాదా॥ కిడ్క॥

మాటలు. కడువడిగా నడుగులిడులిడు విడువు నీయడలనున్న అనుమానము నోరు తడియుడిగినది నిడుదిగూడదు తడయనేరదు కడువేగ జనుమూ నామాట వినుము.

దరువు॥ కురుమతీశునీకృపాశిరమునధరియించి- నాయవరజునింటికి పోయి - సరగునాసుర దేగా॥ పోపో॥

వర్ణన॥ హరికృప వేగా - హరికృప వేగా - శిరమునబాగా - ధరియించివేగా - పోగదేవేగా॥ కిడ్క॥

మాటలు. హే కీరవాణి నా మనవాలకించి సుర నీవతి శీఘ్రముగా ెమ్మా నామాట నమ్మా.

సైరంధ్రి సుధేష్ణతో అనుట.

దరువు॥ ఏమనవలె నిక ఏమని తెలుపుదు - భూమిపాలు రాణి ీమలివిభునితో॥ ఏమ॥ నీచపు మాటలు కచకుడాడగ - చూచినదా విటుదాచగనేటికి॥ ఏమ॥ నమ్మతీగానిను నేమనములోపల నమ్మినదాన టుబొమ్మని పలుకుట॥ ఏమ॥ పరిపరివిధములా - మొరలిడ నీమది - రుగదుకురుమతీ హారిమెచ్చుడీరీతి॥ ఏమ॥

సుధేష్ణ సైరంధ్రితో అనుట.

దరువు॥ మదిరెదేగా పోగాదేవేగా - అతిముదముతో బాగా॥ మ॥ ప॥ పదవేఅనుజుని సదనమునకువేగా - సరగుననురదేగా॥ మ॥ యిన్ని ినములూ నా గృహమందూ - హితురాలనుకొంచూ నున్న నాతో మాటవినావమ్మా- మగువరోయేమందూ॥ మ॥ పంతమేలాయింతినాతోడా- యింతకులోగానూ - శ్రీయంతదెలుపాగాను వినవికనూ॥ మ॥ తరుణిరో నామాటచేకొమ్మా - తలచెద వికసుమ్మా కురుమతి శ్రీహారిని నెర నమ్మా॥ మ॥

మాట. ఇన్ని దినములు నా గృహమందు నున్నదానవనిన్ని నా హితు రాలవనిన్ని అత్యంత ప్రియబాలవనిన్ని కేవలమున నమ్మికగలదాన వనిన్ని అతిరహస్యమైన ముచ్చట తెలుపనైనది, యెందుకనిన యీ ధాత్రియందు మధ్యపానము నిషిద్ధమని పెద్దలు దూషించెదరు మిక్కిలిగా గోప్యముచేత తెలుపనైనది సైరంధ్రి వినుమూ అతి శీఘ్రముగా జనుమూ.

సుధేష్ణతో సైరంధ్రి అనుట.

దరువు॥ యెటువలెబోదునెకొమ్మా - నేనెటువలెబోదునెకొమ్మా॥ప॥ నీచుడైనయాకీచకుసదనము - యెటుబోదునె - యెటుబోదునె॥యె॥ సింహ బలునిసదనంబునకునే - యిమ్మగనేపోజాలనే॥ యె॥ పరిపరివిధముల మొర లిడునామది - కరుగదు కురుమతి హరి సాక్షిగనే॥ యె॥

సైరంధ్రి సుధేష్ణతో అనుట.

తగదమ్మా నను బొమ్మానిపలుకూట॥ త॥ ప॥ మగువారోపగతూ నీమందిరమునకునూ॥ త॥ వినలేదాకీచకుడాడుమాటలు వినలేదా - మన మూనకనికరముమానీ యిటులాడగ॥ తగ॥ తొలుతానీయింటా నిలచెవేళలో తొలుతానే చులకాని పనులు నావలనగాదనలేదా॥ త॥ సైరంధ్రీ జాతుల వారికెందైనసైరంధ్రీ - పిరులగూర్చుటగాని సురదేగా ధూష్యమూ॥ తగ॥

అతివారో ఏవురు గంధర్వులుపతులు - హతమొనరించేరు హితవుగాదిది నీకూ॥ త॥ కరుణించుమా మనగా నామొరవిను కరుణించుమా- విరుబోణికురు మూర్తి హరిమెచ్చ డీమాట॥ తగ॥

మగుడి సైరంధ్రి సుధేష్ణతో అనుట.

దర్వు॥ న్యాయమేమో యిది శ్రేయమా యిటుబలికేది - తోయజాసనా యేమిందూగూడెనె - నీ వినవే తోయజా॥ న్యాయ॥ న్యాయము గాదూ - న్యాయముగాదు న్యాయ॥ ధర్మముగాదు - యీయపవాదు - వూరికపోదు - నీదయలేదు - ఏమననీదు - మనుసుకు రాదు - యేటు వలెబోదు॥ కిడ్క॥

మాటలు. రాజరాణివైన సుధేష్ణ వినుము మహాక్రూరుడైన ఖలుని ఆలయమునకు నన్ను బొమ్మని ఆజ్ఞాపించితె నాయత్నము లేదు నీవు పంపించేది వుచితముకాదు.

దర్వు॥ అనుజుగృహమునకూ - నన్నునంపాబోకుమనుచూ నిన్నూ వేడుకొనియేదా - నీవువినవె॥ తోయ॥ న్యాయ॥

వర్ణన॥ ననునంపబోకు - ననుచంపబోకు - మనమునసీవూ - యిటులాడబోకు - తెలియదునీకూ - కోపముగాకు - పాపమునీకు॥ కి॥

మాటలు. నీ అనుజుని గృహంబునకు నన్ను బంపించేది న్యాయముకాదు నీతమ్ముడు నిను గనుగొనవచ్చినప్పుడు నీవెనుక నేను వొదిగివుండగా నీతమ్ముడు ననుజూచి ఆడరానిమాటలు బలుకుట వినలేద అమ్మా విరాట్ భూవరునికొమ్మా.

దర్వు॥ మదుగొని తేగానొక్కామదవతీ నంపూమికా - సదమాల మతిబోగా - జాలనునే - నీవువినవే॥ తో॥ న్యాయ॥

వర్ణన॥ మధుగొనితేగా - మధుగొనితేగా - మగువనువేగా బంపుముబాగా - తెలిపెదవేగ॥ కిడ్క॥

మాటలు. శంకిలకా నీ యింటిలోనున్న పంకజముఖులలో యింకావక్కతిని కొంకక అంపుము నన్ను బొమ్మని బలాత్కారముచేసి కోపించి బలుకుట సంభ్రమమా సుధేష్ణమ్మా.

దర్వు॥ కురుమతినిలాయినికరుణగలదాపావనీ - పరిపాలింపూమని ప్రార్థింతునే - నీవువినవే॥ తో॥ న్యాయ॥

వర్ణన॥ కురుమతిహారిని - కురుమతిహారిని - మందరధరుని పాపవిహారుని - శ్రీరమాపతిని - నమ్మితిమదిని కొనియాడెదమతినీ॥

మాటలు. కురుమతిగిరి మందిరుడైన శ్రీహరి కరుణాకటాక్షం బునకు పాత్రురాలనైన శరదిందుముఖి పరిపాలింపవలసినది శరణాగత నయి ప్రార్థించెదను మరిమరి చెప్పనేటికి ముమ్మాటికి.

సుధేష్ణ సైరంధ్రితో కోపించుట.

మత్తకోకిల॥ ఉత్తరంబులకిట్లునే ప్రత్యుత్తరంబులు జెప్పగా - యుత్తరంబదిగాదుమానినియుక్తులెల్ల యుడుంగుమా - యెత్తవేవి స్త్రీళ్ళు త్తొత్తిన నెంతమంది భుజించిరో - మొత్తముగ్ వెనదెల్పుమన్నటు ముందుసామితెలాయగా॥

సైరంధ్రి దుఃఖించుట.

దర్వు॥ శోకవరాళి॥ యేలపుట్టించెనో బ్రహ్మ - అయ్యో పాపిజన్మా యేలా॥ ప॥ చాలాగానాపూర్వకర్మామిటాలాగుండా॥ యేలా॥

వర్ణన॥ యీజన్మమేలా - పాపిజన్మమేలా - బ్రహ్మాకుమేలా - పుట్టించనేలా వుండగనేలా - నిల్వగజాలా శ్రీహరీహేకృష్ణాద్వారకాపురివాస॥

గీ॥ యిట్టిజన్మమేలపుట్టించెనో దాత। మొదటజన్మకర్మ మొనరగూర్చి। పరులచేత భంగపడుమనివ్రాసెనూ - యేమిసేతుకరుమ తీరకృష్ణా॥

వర్ణన॥ రంగరంగరంగా శ్రీపాండురంగా । ఖగతురంగా కరుణాపాంగా నవమోహనాంగా అయ్యో శ్రీరంగా॥ కిడ్క॥

మాటలు. హరిహరి మహాకష్టపుదిన మిదియః పరులవద్ద నుండుటకు సరసిజోద్భవుండు నన్ను సృజించె నెందుకు దుష్టాత్మునిమందిరమునకు పోయిరమ్మని ఆజ్ఞాపించి కోపించినందుకు యేమందు ఘనతపోనిధులైన మునిజనహృదయమందిరుడైన శ్రీకృష్ణమూర్తికి నాయందు కరుణాకటాక్షంబు లేనందున మానభంగకాలము ఘటించెను కన్నుగవల నశ్రుజాలములు గురియుచు బంగారపుగిన్నె చేతగొని ముంగటికి జనుసమయమున కృష్ణా వాసుదేవ దేవకీనందన నందగోపకుమార గోవింద పంకజనాభ నన్నురక్షింపుమనుచు అంగనాకులమణి సర్పసదృశ వేణి.

దర్వు॥ కుటిలామంతాలూలోన - యిటులాడగానూ॥ యటుల సైరింతునేనేనూ - కుటిలతమధుపును తెటుకునదెమ్మనుచు - హాటముసాధించె యింకెటులసుధేష్ణా॥ యేలా॥

వర్ణన॥ యీసమయమునా - నేసైందునా - యెవ్వరితోన తెలుపుదుగానా - విధికృతమునా - తెలియాగానా॥ కిడ్క॥

క॥ నాసరివారిలో వాడిటు । జేసిన అపకీ ర్తికింక చింతలవలసె౯।
మోసమొనర్చెసుథేష్ణయు । భాసురకురుమూ ర్తిరమణ భక్తో
ద్ధరణా॥

వర్ణన॥ దేవాదిదేవా । మహానుభావా - సన్నుబ్రోవా
నీవెకావ॥ కిడ్క॥

మాటలు. నేనేమిసేయుదు పూర్వమందు యెవ్వరి కేమిదోషం
బు గల్పించినానో ఆసంచితము నేటికి అనుభవించనాయెను దేవా దివ్య
ప్రభావ.

దరువు॥ యెవరితో దెలుపూకుందూ - యివ్వాళలోనిందూ - అ
వధీలేదింకానిందూ - ఆవనిపాలునిరాణి కరుణలేదిందూ - దివిజాధీశ్వర
కృష్ణాదిక్కు నీవిందూయాలా॥

వర్ణన॥ శ్రీవాసుదేవ - మహానుభావా - సన్నూబ్రోవా -
తెలియగలేవా - రాగం॥ శ్రీహరి॥

క॥ ఇంకెవ్వరితో దెలుపుదు । పంకజముఖరాజపత్ని పగసాధించె౯ ।
సంకటముదోచమేనున । వెంకటరమణాసుకరుణ వేతోద్ధరణా॥

మాటలు. యీ సమయమందు యెవ్వరితో దెలుపుకొందును బా
క్కగానని పామురీతినైతినిగదా దేవా నాపై కరుణలేదా॥

దరువు॥ కురుమతీశ్రీహరునిదలచీ - మరుగూననిలచీ - గురిగా
సూర్యునీజూచీ కరమూలూమొగచీ - కరుణాతోబ్రోవూ మనుచూ సుర
గిన్నెతా గొనుచూ॥

వర్ణన॥ ఎవ్వరితోను - దెల్పగలేను యీవ్వాళలోను - మందర
పోనూ - సుథేష్ణాను - కోపముతోను పలుకగాను॥కిడ్క॥

క॥ కురుమతిహరియని దలచుచు । మరుగున తానిలచి సూర్యమండల
వర్తి౯ । హరితాప్రార్థనజేయుచు । సురత్సషకముచేతబూని సుద
తియు వెడలె౯॥

మాటలు. యీ దినమందున యిత్యాది దరిశనములేసందున హరి
సర్వాంతర్యామి అనే న్యాయముగా సూర్యమండలమధ్యవర్తి నారాయణ
స్వరూపు డని సూర్యుంజూచి కరములు ముకుళించి నమస్కరించి కురుమూ
ర్తి హరినిదలంచి నరుగుచున్న సమయంబున కీచకుండు సైరంధ్రి రావడం
గనుంగొని బహిద్వారంబున నిలుచున్న వానిం గనుంగొని సైరంధ్రి
దుఃఖించుట.

దరువు॥ యేమి సేతునమ్మయికా హితవుమాలి గీచకుఁడూ - కుటిల మమదిదలచి వాకిటిలోనిలిచెనూ॥ యేమి॥

వర్ణన॥ నేనేమిసేతు - నేనెందుబోదు - యంతకునోర్తు - శీఘ్రగటు దాతు - నెవ్వరుబ్రోతు॥ కిడ్క॥

మాటలు. యేమిసేతునమ్మ యిందుకు వుపాయముతోఁచ దాయను నారావడం గనుంగొని నీచాత్ముండై కీచకుడు కుటిలమనస్కుఁడై బహిద్వారంబునందు నిలచియున్నాడు దుండగీడూ.

దరువు॥ మదిరకొరకువచ్చి వీనీసదనమందుభంగ మొందా - మొదట బ్రహ్మదేవుడు నానొదుటవ్రాసెనో॥ యేమి॥ ప॥ సురకైరాగా- చూచియు వేగా నీచుడుబాగా - వాకిటిలోగా దాచుకొనగా - దెరవు గానా॥కిడ్క॥

మాటలు. సరవరాగ్రణియైన విరాటభూవరుని భార్యామణి మరుగు చేసి యనుజునింటిలోగల సరసమైన అతిత్వరితముగా దెమ్మనిపంపి నందున దుర్మార్గుని మందిరంబునకువచ్చి చిక్కఁబడి పరిపరివిధంబుల దూరవ సంజెంద మని పరమేష్టి నానొదుట వ్రాసెనేమోకదా హే భగవంతా రుక్మిణీకాంత.

దరువు॥ మరలపోదునంటినేని - మచ్చరించుయాసుధేష్ణ - తర ముగాదుయింటనుండా - తగదుపొమ్మనె॥ యేమి॥

వర్ణన॥ హేభగవన్తా - రుక్మిణీకాంతా వరశ్రీమన్తా - కరుణా స్వాన్త - నా మొరవింత - తెలియవింత - యీశ్రీమాంతా - గలిగెను చింతా॥ కిడ్క॥

మాటలు. వెనుకకు తిరిగిపోతినాయన గనుఁగొని సుధేష్ణ మనము గాకోపించి నామందిరంబున నుండకూడదని నిందించి నిరాకరించితే యెందు బోగలను కృష్ణా ద్వారకావాస సుజనమనోల్లాస.

దరువు॥ దరియుదాపులేనిదాన - దైవమానసుబ్రోవ నీవె - కురు మతిశ్రీగిరివరేణ్యాకోరిమొ్రక్కెదా॥ యేమి॥

వర్ణన॥ దరియూదాపు - లేదికప్రాపు - యింతయుదాపు - యేసతి నోపు-కుటిలునిమాపు - గొనకొనిసేపు॥ కిడ్క॥

మాటలు. దరియుదాపులేనిదాననై పరితపించి వురిలొ చిక్కఁబడిన పక్షిచందంబున పట్టుబడి మొరబెట్టుచున్నాను నేను అనాథను ఆదరింప వలసినది కరుణాపయోనిధి.

కీచకుని మాటలు. వారణము నడుకతో దూరమున రాగా గని నారీ

మణినిచూచి కోరికేఫలియించెనని చాలా సంతోషమున ద్వారంబున నిలిచి నారీవయ్యార్రి, సుకుమారి సుందరీ రాయని కీచకుడు మోహితుడాయెను.

కీచకునికి సైరంధ్రికి వాదం.

దర్వు॥ సుందరిసిరులొందవె నా మందిరామందూ - నామంది॥
పల్లవి॥ యిందువదనకుందరదన - పొందుము అను వొందనాతో॥ సుం॥

వర్ణన॥ సుందరియిందు॥ సుం॥ నన్నూబొందూ - సౌఖ్యమునొందూ నాగృహామందూ - వుండుమిఇందు - అనుదినమందు-తలచెదనందూ॥ కిడ్క॥

మాటలు. హేసుందరీ మందగమన చంద్రవదన వురగవేణి చిగురాకు బోణి ముక్కంటి కంటినుండల జేగొంటుపడని తుంట విలుకానిచేతి చిలుకా పలుకుము సుధలొలుక.

సైరంధ్రి దర్వు॥ చెల్లదునీవన్న పలుకులెల్ల విడువిడూ - కల్లగాదు నాప్రాణవల్లభుడుల్ల నేతురు నిజముగా నిక॥ చెల్ల॥

వర్ణన॥ వినుమినరోరి॥ విను॥ దుష్టాచారి - రామునినారి - సీతనుగోరి - రావణుడోరీ - చెడెనువారి - నాపతులోరీ - బల్లిదులోరి - తులువవువారీ॥ కిడ్క॥

మాటలు. వరె దుండగీడ మెండుబలుకికుండుము యీ భూమండలమందు నాపతులు గదాదండ పాండిత్యమునందు భుజబలోద్దండ ప్రచండశిఖామణులు నీకండగర్వముచేత బలుకబోకు. నీతుండము ఖండించి చండాడక విడువరోరి దుష్టా పరమ పాపిష్టా.

కీచకునిదర్వు॥ నన్నుబొందినసౌఖ్యమూ వున్నదియాధిక్యమూ- వన్నెలాడినిన్ను విడువనన్న మాటది నిక్కమూ॥ సుంద॥

వర్ణన॥ తాళగజాలా - తాళగజాలా - నిల్వగజాలా - యిది నీకు మేలా - నను బొందు బాలా - యికజ్యాగేలా - సైపగజాలా - వోర్వగజాలా॥ కిడ్క॥

మాటలు. హే మత్తగమన నాతో పొందియుండుటవలన సౌఖ్యము గలదు నిన్నిడువబోను నిక్కము చిత్తజుచేతి నుత్తమాస్త్రము వొత్తుటచేత చిత్తము తత్తరించుచున్నది నాతో కూడవలసినది.

సైరంధ్రి దర్వు॥ దురభిమానముడుగరా - గర్వముతో చెడకురా - మరువకయిత్తరినిబ్రోచు - కురుమతిహారియుగలడు॥ చెల్ల॥

వర్ణన॥ దురభిమాన॥ దుర॥ దుర్మదమూనా - ఇటులనగా యిదిహితమానా మానాహీనా- యేమిటుదగునా - యిఘనీతోనా-మాటాడేనా- నామనవినినా - బ్రతుకుదుగానా॥ కిడ్క॥

మాటలు. వరేమర్మదాంధ నీదురభిమానముడుగు వులికిపడకు గర్వముతో చెడకు అనాధరక్షకుండైన కరుణమూర్తి హరి గలండు పూర్కే వుండూ.

కీచకుని దర్వు॥ ఉడుపాననకడు ముదమున నొనగూడుము నాతోడను - పడతీనాయడగలధన - ముడుగకనీకిడుదునూ॥ వుడు॥

వర్ణన॥ వుడుసతివదన - వేడజాలుదునా - పడతులలోన - ప్రౌఢవుగానా - కడుమోదమునా - వేడితిగానా॥ కిడ్క॥

మాటలు. వారిజానన నీసౌందర్యము జూచి నామనస్సు నిల్వనోపదు నారీమణి నన్ను చేరియున్నట్టాయన యీధారుణి సాంరాజ్యమంతయు నీదెగద బాలా యింత జ్యాగేలా.

దర్వు॥ జగమునుతగమోహింపగ చిగురాకడిదము బాకున - పగచేవిదికేక్కువగా - మగువానిను సృజియించెను॥ వుడు॥

వర్ణన॥ చతురాననునీ॥ చతు॥ ప్రతినేబూని - రతిపతివానిగూర్చెనుగాని - మదగజమాని - విడువగలేని - మగువావాని॥ కిడ్క॥

మాటలు. యీజగతియందు అత్యాధికులైన విటులకు మనస్సుభేదించును నీచూపుస్వరూపమనె మోహనాస్త్రము నామనస్సుకు తగినదాయను హరిహరవిరించి శక్రాదిదేవతల భార్యల సౌందర్యముకన్న హెచ్చుగా తోచబడుచున్నది మన్మధుజ్ఞాతి మత్సరముచేత బ్రహ్మపై మారొడ్డి నిన్ను జగత్తు భ్రాంతిబొందించు రీతిపుట్టించినాడేమో ఇంతేకాక నన్ను భ్రాంతిబొందించేకొరకు నిన్ను నిర్మించినాడో లేక యీ జగమెల్ల మోహించవలెనని సృజించినాడేమో యిందుకు నెటుదోచదాయను యింతీ దీర్పవే నామనో భ్రాంతి.

దర్వు॥ చిలుకలవలే పలుకులు కోకిలములబోల్ సుస్వరములు కలువాకన్నులు - తెరచిజూచిన నిలువోపదు॥ వుడు॥

వర్ణన॥ కలువలబోలు - కలువలబోలు - కన్నులుజాలూ - చిలుకలబోలు - పలుకులుచాలు - జగములుబోలు - నడుకలుచాలు చెవులబోలు - శ్రీకారములు - చీమలబారు - చెలినూగారు - చెలి నీకురులూ-తుమ్మెదగములూ॥ కిడ్క ॥

మాటలు. వజ్ర వైడూర్య హేమలంకృతంబైన భోగమందిరంబు నర్మజనవలె నిన్నుగూడవలె సుఖించవలె వేగరావే సుఖించగదవే.

దర్వు॥ మరిసరివీరీశరములునా వరహృదయము జొరబారగ తరుణీమణి తరమానా ధరకురుమతి హరి యెరుగును॥ వుడు॥

పల్లవి॥ మరుశరములునా - మసుశరములునా - నర
నా - జోరబరగనా - తరమికనగునా - అరమరతగునా
నయనా - సరసిజవదనా - నిర్మలమైనా - పద్మనయనా॥ కిడక

మాటలు. మదనుని బాణములు నా హృదయము జ
చుచున్నవి వినవె పద్మనయన నీ హృదయమందు కరుణ గల
నములోకి పదవే నిర్మలమయిన పరియంకమున వసియిం
భోగించుమా.

సైరంధ్రి కీచకునితో అనుట.

దరువు॥ తరమేమిరోరియిటులన॥ త॥ ప॥ పరభామల
లాడుట॥ తరా॥

మాటలు. వరె కుటుంబముగలవాడ వినుము పరనా
కృలుబలుకుట తరముగాదు పాపమే తెచును నీపురము భేదిం
డు శిక్షించును దుష్టాకుజనగణశ్రేష్టా.

దరువు॥ అమరాధిపుడుగౌతమునిభార్యకై భ్రమసిదే
లగుట విను॥ తరా॥

మాటలు. సురాధిపతియైనయింద్రుడు అహల్యపై
మందిరమునకువచ్చి జొచ్చినంతలో గౌతముడువచ్చి కో
మిచ్చినందుకు మైనిండ రంధ్రములాయెను పరమ సుందరుల
నీకు వుచితముకాదు వట్టివాదు.

దరువు॥ పాకశాసనునిపణతికి నహుషుడు - నా
మందుబడె॥ తరామేమి॥

మాటలు. స్వర్గమేలుటకు తగినవారలు లేరని వెదకి
యోగ్యులైన సురులందరు సింహాసనమున ప్రతిష్టించిన న
మేలుతువుండెను. యిట్లు కొన్నిదినములు జరుగగా యిం
శచీదేవిని నహుషుడు గనుంగొని మహామోహాందకారం
ననెను యేమనగా నేనుఇంద్రుడనైనందుకు యింద్రునిరా
వాదువని బలాత్కారముచేత ముట్టబోయిన శచీదేవి గడ
సురగురుకడకుబోయి మొరశాయగా వారు తెలిపిరి వొకన
తెలిపినముచ్చటవిని తనగృహముప్రవేశించి నహుషునకు
గా సప్తఋషుల భుజములపై పాలకిదండె మోయించుక
నుండి నాయింటికి వచ్చినట్లాయన నాపతియని తెలిపెదను

నని చెప్పిన నహుషుడు ఆమాటలకు సంతోషించి సప్తఋషులరావించి అందలము వారికందలమునిూద మోయించుకొని శచీదేవి మందిరమునకు బోగా, మునులకు గోపంబువచ్చి భూమిమిూద అందలమువైచి శాపమిచ్చిరి అందు నుంచి అజగరుడాయను వినుమూ వెస తెలుసుకొనుమూ.

దరువు॥ సుతసహోదరాభట యుతముగ రావణుడు - హతుడాయను రఘుపతిసతికొరకై॥ తరా॥

మాటలు. వరే కుచ్చితమతీ వినుము. శ్రీరాములభార్యయైన సీతాదేవిని రావణుడు గొనిపోయి సుతబంధు మిత్రాదుల యుక్తముగా హతమాట వినవా దుష్టా పరమపాపిష్టా.

దరువు॥ పరమపతివ్రతగురుతుదెలియక - మొరగిన కురుమతి హరి శిక్షించును॥ తరా॥

మాటలు. పరమపతివ్రతలైనవారి గురుతులు తెలియక యిత్తెరంగున బలికిన కురుమతికి గిరిమందిరుడైన హరి నిన్ను శిక్షించును నన్ను రక్షించును.

కీచకుడు సైరంధ్రితో అనుట.

దరువు॥ విడువజాలనేనీతి నుడువన్యాలనే - బడిబడి యిటుబలుకగనే విడువబోనుపడతినిన్నూ॥ విడు॥

మాటలు. పడతీ యిప్పుడమిలోపల నీతిశాస్త్రము లుగ్గడించి బిడియముడిగి నాయెదుట నుడువగానె నిన్ను విడువబోను కుందరదన రాకేందువదన.

దరువు॥ చాలగమదిసోలెనె బతిమాలినగానీ - పాలుమాలినయుక్తులునా - మ్రోలదెలుపనేలచాలు॥

మాటలు. మదుని విరశరములు నా యురమునందునాటి పరితపించగా వెరచి కరములుమొగిచి సురతక్రీడకు అనుకూలింపుమని వేడగాను పరస్త్రీనని పతివ్రతనని పాపమనిబెదరించగా నేవిడుదునా కడువడిగా చంకనిడుకొనిపోయి నామందిరమందు నీతో రమింతునుమ్మీ మనసులో దేంసుకొమ్మీ.

దరువు॥ సిడిముడిగొనికడువడిజని - పడతినపుడుపుడమిగెడుప - నదరకుమని రవి భటులటుపిడిపించిరి యడచిరతని॥ విడు॥

మాటలు. పరస్త్రీబొందుటవలన పాపమని నీతులుగ్గడించితివి పూర్వో కులవృత్తాంతంబు దెలుపగాదగదు మొగవాండ్లకు బలాత్కారమే సద్ధర్మమే సరి హరిహరాదులకైన చెల్లినది ఏలాగంటె పదహారు వేల గోపికా స్త్రీలతో బొందిన శ్రీ కృష్ణమూర్తికి యెగ్గేమి దారుకావనమున మునిభార్యను బొందిన సాంబమూర్తికి కొదువేమి అయిన మొగవాండ్లకు బలాత్కారమే చెల్లినది భామ సద్గుణశ్యామ.

దరువు॥ మొరయుమేనిధూళినీదు దొరయకన్నుగవలతోడ - ధరణీశుని సభకేగెను కురుమతి శ్రీహరినిదలచి॥ విడు॥

## సూర్యదూతలు కీచకునితో అనుట.

మాటలు. వరెవరె పరనారీమణిని హరిహరీయని మొరసేయగా దురమునతరిమి పట్టుటకు నీ తరమా భరమా దుర్మార్గా నీవరగర్వమణంచుటకు కరకంఠుడు మమ్ము బంపించెను వినుమూ కీచకాధమా ధట్టించి రొమ్ముపగుల దన్నెదము నీచా మేమనేది సాచా.

దరువు॥ పుడమికిపడగెడ పెనుపడతుకనూ - వేగనడతుము పట్టుడి రోరిఖలునీ॥ పుడ॥ అంటాగూడుము యింకాదెలియా - వినుతుంటలు జేతు ముదిబ్బలయా - మంటాలమారికి హర్షాము గావించి - కంఠాముదెగ వేయకుంటె ముంతురుకార॥ పు॥ వనజాక్షి ధ్వనియుతావినగా - మముదిన కారుడంపించెను త్వరగా - మనుటాబేషైయుంటెమగుడనింటికినేగూ అనుమానించితివేని గొనిబోదుము యమపురికి॥ పు॥ హరిసర్వాత్మకుడాని యనవాదిభరితుడై యుండూటగనవా - కరివరదునిప్రహ్లాదుని మొరవిని మును రక్షింపడె - తరుణీమణిబ్రోవగ యీ కురుమతిశ్రీహరిజాలడె॥ పుడ॥

మాటలు. వరేమూర్ఖా సైరంధ్రి మొర నాలకించి శ్రీసూర్యాంతర్యామి ప్రేరేపణచేత మమ్ము బొమ్మని యాజ్ఞాపించెను నిన్నడంచుట యాశ్చర్యముకాదు నీకు విధిప్రేరితము వేరేయున్నది యింతలో నీవు యమపురికేగెదవు వినుమూ నీత్రోవ జనుమూ.

వ. ఆ సమయమందు కీచకుని బెదరించి సైరంధ్రిని పట్టుకున్న రెట్ట విడపించిన సైరంధ్రితత్తరముచేత విరటునిసభకు పరుగెత్తిపోయిన సూర్యదూతలు తమనివాసంబులకు నేగిన కీచకుడు సైరంధ్రిపై మోహముచేత దుఃఖించును.

దరువు॥ యెందుబోయెనో చెలియిందు లేదూ॥ యెం॥ ప॥ బాలాగుణజాలా సుశీలావిరిగోలా - యిందూలలేనుమరి॥ యెం॥ యింతీ పూబంతీ

మరుదంతీ - చామంతీ - సంతానముతో కాంతు కేళిగూడ॥ కెం॥ మరుడూ తస్కరుడూ - విరిశరుడూ - పామరుడూ - నన్ గరుగ జేసెమరి॥ యెం॥ మతినీకురుమతిని శ్రీహరినీ- నామదినీదలచుచునుంటిమరి॥ యెం॥

వ. విరాటుని సభలో కంకార్యులతో సైరంధ్రి తన భంగపాటు దెలుపుట.

దరువు॥ కానన య్యో యెవ్వరీ - తోను దెల్పగబోదు భూవరా - కా॥ కన్నవారలూ లేరూ - కన్నులుమూసినారూ - నన్ను కాలదన్నా గనుచు న్నతీ సభకు లెల్లా॥ కాన॥ ఆడబిడ్డలానుగన్న - ప్రౌఢులెవ్వరైనా నేడూ - జూతురుగాసీ కూడదనజాలరైరి॥ కాన॥ ధర్మాధికంకార్యులూ - వోర్పుతో నుండూటాలూ - దుర్మార్గునణపజాలూ - కురుమతిశ్రీహరిగలడూ॥ కాన॥

మాటలు. ధర్మజ్ఞులైన కంకార్యులు రాజసముఖమందుండి నాయొక్క పరితాపంబు చూడక మాటలాడక యున్నారు వారికి నాయందు కృప లేనిదాయెను పరమేష్టి నన్ను పుట్టించె నెందుకు యీ శ్రమపడే టందుకు.

ధర్మరాజు సైరంధ్రితో అనుట.

దరువు॥ విడువిడుపడతి కోరికలుయింకా పుడమిాశు నెడనీ నుడువులూ జాలూ॥ విడు॥ జనమూలు సుఖదుఃఖములనూ పూర్వమున జేసీ సంతాతా మనుభవింపుచునూ - జననమరణములనొందుచునూ - యిట్లు వనజాసనుని చేతవ్రాయుపోకేనూ॥ విడు॥ ముందూహరిశ్చంద్రానలులు పురంధరాధిపుడు చంద్రాహాసున్యాడూ పొందరే యిడుమూల నపుడూ పాంశుడునందు డింద్రా ప్రస్తంబూనజూడూ॥ వి॥ మరియూదగాదు యీసభనూ చాలాపరిపరివిధ మూలా మొరలు బెట్టుటనూ పరమపతివ్రతలకునూ యింకాకురుమూర్తిహరి బ్రోచు మరువాక యికనూ॥

మాటలు. హే పడతీ రాజసముఖమందుండి మిక్కిలి వదరుట మరి యూదగాదు నీవల్లభులెల్ల శ్రీహరికి సమ్మతమైన వారలు వినుమూ యిచట నుండక జనుమూ.

భీముడు విరటుని సభకు వచ్చుట.

మాటలు. మహిమెల్ల సదృశుడైన భీముండువచ్చి సఖినిజూచి హుంకరించి భటులోత్కటభృకుటినిటలమున ముడిబడునటుల సంఘటించి కటి

తటిమదర ఘర్షణంబొనర్చి కన్నుగవ కెంపుసొంపెసగ మిన్నరసిచూచి పుల్లొ
శ్రమచేతినిలచి దుర్మధాంధుడయిన కీచకునికులము నిర్మూలముచేయు తలం
పున విశాలశాఖలచే యుక్తమయిన పెనుమ్రాకునుచూచి పెరుక నాలో
చించగా ధర్మరాజుజూచి భీమునకు కనుసైగజేసి యిట్లనియె.

ధర్మరాజు మాటలు. వరెవరె రాజ సేవకులలో మిక్కిలి మంద
మతులైన జనులారా! వినుడు వలలుడీయెడ పాకముకొరకు దహించుటకు
కాష్టములు లేనందున చెట్టుబట్టి వేళ్ళమట్టుగా పెకలించుకొరకు వచ్చి
యున్నాడు వీనికి సంఘటించివున్నది మహాకోపము యిట్టియెడల వట్టికట్టె
లు దెప్పించియిచ్చి సమ్మతిమొనర్చుమని పరిచారకులకు చెప్పి అంపగా
భీముడువిని వెనుకకు తిరిగిపోగా.

సైరంధ్రి దుఃఖించే దరువు॥ హరిహరియిక యెవ్వరునన్ను నెరిగష్టపు
డినమందూ - మొరవినియెడి వారెవ్వరు లేరిందూ- హరిగతి నీవందూ॥హ॥

మాటలు. పన్నగశయనుడు పాల్గడలికూతురు పతియైనవాడు
నాయొక్క ఘనమైన ఆపత్తును పరిహరింపరాదో అనాథ బంధుండనే
బిరుదు లేదో.

దరువు ॥ కడుదుర్యోధనుసభనూ - విడిపించిరి వలువలనూ హాహా
అడివిలొ సైంధవు డొడిగొని పోవుటనూ - చెడుకీచకుడిటనూ॥ హరి॥

మాటలు. యీముగ్గురినుంచి బహుబాధతోచబడెను యేలాగనిన
కురుపతి సభలో వలువలు విడిపించెను రెండవసారి దుర్మార్గుడైన సైంధ
వుడు శిగబట్టుక యీడ్చుకొని పోయెను మూడవసారి యిక్కడ కీచకుని
చేత కష్టమనుభవించనాయెను యిందుండ దగదు హే కృష్ణా! వినుమూ
కృపాకటాక్షము గనుమూ.

దరువు ॥ మమతయుమానెనొ ధర్మజుడూ భ్రమలుడిగెనో యర్జునుడు
హాహా ॥ సమయముగాదనె భీముడు నిపుడూ సమబుధనృపుడు॥ హరి॥

మాటలు. ధర్మహాని కాగలదని యుధిష్ఠిరుండుకోపించె అన్న యా
జ్ఞచే భీముండుతిరిగి వెనుకకు జనెను. కిరీటి మరచెనొ నకులసహదేవాదులు
యిరువురు ఖలునిసముఖమందునిలచి మాటలాడజాలరు బ్రహ్మాదుల కధి
కుడైన పరబ్రహ్మకు యెందుకు దయరాదొ కృపాకటాక్షములేదొ.

దరువు ॥ మరచిరిమత్పతులూ - యిరవొందెను దుష్కృతులూ -
కురుమతి హరి కెరుకగునా సంగతులూ - గురుతరమగు వేధలూ॥ హరి॥

మాటలు. ధర్మజభీమార్జున నకుల సహదేవాదులైన నాపతులు నాయందు కృపాకటాక్షము లేనందున దుర్మార్గులచేత అనేక బాధలు నొందనాయెను కురుమతి గిరివర మందిరాధీశ్వరుడైన శ్రీహరికే తెలుసును నాయొక్క సంగతులు యిదియేమో చిత్రమూ దైవయత్నమూ.

వ. ఆ సమయమందు ద్రౌపదీదేవి భీషణచిత్తయై స్వస్థలంబునకు బోయి నిదురించుచున్న సుధేష్ణను మేలికగావిన్చి జరిగినవృత్తాంతంబు సవిస్తారంబుగా దెల్పగా నామె దుర్మార్గుండైన కీచకుని బిలిపించి శిక్షింప చేసెద ననిన తాపోపశమనంబుగాక భీమునితో తనభంగపాటుదెల్పవలెనని యోచించుచున్న సమయంబున సూర్యునితోడ తన దూత లేతెంచి సింహాబలుని యుద్ధవృత్తంబునివారించి యాజ్ఞచేవిని విడిపించిన వృత్తాంతంబు తెలిపినంతలో సూర్యుండు అరుణకిరణుండై కీచకుని చూచిన మాత్రమున దోషమేతెంచునని యోచించి యీమండలంబు ప్రదక్షిణంబుచేసి ఆ దోషము నివారించుకొనవలెనని పశ్చిమదిగ్భాగంబున నస్తాద్రికేగెను అట్టి సమయంబున సింహాబలుని మహాదోషంబు దిఙ్మండలంబు వ్యాపించెనో యనగా గాఢాంధకారంబువ్యాపించెను సన్మార్గమందు ప్రవర్తించు పుణ్యపురుషులకు సర్వదోషంబులు జెందనివిధంబున నక్షత్రంబులు ప్రకాశింపగా పురజనంబులు రద్దిలేకుండ నిదురించుచుండగా సైరంధ్రి స్వస్థళంబు విడిచి జనె భీముని వంటశాలలోగనె.

దరువు ॥ తెలిపెదా యీజాడనూ - భీమునితోడనూ ॥ తె॥ ప॥ కృపగలదని యానృపసతికీ నే - నుపచరింపగా కపటమొనర్చెను॥ తెలి॥

వర్ణన॥ తెలిపెదజాడ ॥ తె॥ భీమునితోడహాహా - నా మొగనితోడ - కీచకునిజాడ - శమనునితోడ॥ కిడ్క॥

మాటలు. అపారవారమైనకృపగలదని నృపవిరాటుసతికి నుపచారమొనర్చుచుండగా కీచకుడువచ్చి నీచవాక్కు లుచ్చరించి యామచ్చకంటిని పచ్చవిల్తుకేళికి వచ్చునట్లు సేయవలసినదని మిక్కిలి అక్కరతో గూడ బోధించి పోయినపిమ్మట సుధేష్ణవుపాయముచేసి అనుజునింటిలో సురగొనిరమ్మనగా తరముగాదని పలువిధంబుల మొరలిడినా వినక బలాత్కారము చేసి యిందుండవలదని పొమ్మని కోపించిన మీద బంగారపు గిన్నెచేతగొని ఖలుని మందిరమునకు పోయినంతలో దుర్మార్గుడైన సింహాబలుడు అడ్డగించగా గిన్నెపారవైచి తిరిగి రాగా వెంటదగిలి కురులు బట్టీడ్చిన భాస్కరుని

దూతలు విడిపించి పోయిరని వాతాత్మజునితో బోధించెద నా పగ సాధించెద.

దరువు॥ ఆ మహాక్రూరుని నామమడచి నను - ప్రేమతో బ్రోచెడి యీ మహాత్మునకు॥ తెలి॥

మాటలు. ఇంతేకాక ఆ మహాక్రూరు నడంచుటకు దుర్వారభుజ బలపరాక్రమవిక్రమ సోముడగు భీముండు చాలబోలునని నిశ్చయమంది చక్కగా దెలిపెదను పురికొలిపెదను.

దరువు॥ శిరివరుడగు శ్రీహరిమతిహారికి వరసేవకుడగు మారుతాత్మజుతో॥ తె॥

మాటలు. మిక్కిలి భగవదనుగ్రహము గలిగిన మహానుభావుడు పరమభాగవతోత్తముల చరణసేవానిరతుడు దివ్యజ్ఞానధురంధరుడు శ్రీమన్నారాయణ దివ్యనామంబు తన హృదయమందు నిరంతరము ధ్యానించు పవిత్రమానసుండైన మహానుభావునితో గూడ తెలిపెదను యీ జాడ వేడుకతోడా.

(సైరంధ్రి భీమునితో అనే దరువు.)

కోవిదనుతమారుతాత్మజా - నన్నుబ్రోవుకరుణాతో మహారాజా - ననుగనుగొనలేదా కీచకుడొనరించిన బాధా మనమున దెలిసినదదిగాదా నన్నూ॥ కో॥

వర్ణన॥ వినురాజా - వినురాజా - దినకరతేజా - కవివరభోజ - కల్పక భూజా - వినుమహారాజా॥ కిడ్క॥

మాటలు. హేప్రాణేశ నామనవి వినవలసినది కడువడిగా నావెను వెంబడి వచ్చి పుడమిపై బడద్రోసి తన్నగ రవిభటులు విడిపించిరి తెలసి నేడు కరుణజూడూ.

దరువు॥ నాకేవురుపతులూ త్రిలోకము లెరుగుటాలూ - గైకొన కుండితె మెచ్చరుబుధులూ - నన్నూబ్రోవుకరుణాతోమహారాజా॥

మాటలు. యీ భూమండలంబందు వక్కసతికి వక్కమొగడు గలుగుటచేత అతిప్రీతితో పోషింతురు నావక్కదానికి వుద్భట పరాక్రమము

గలిగిన మేవురు పతులుండియు నాకుభర్తలో లేక వ్యర్థులో యే మాయ మీాశౌర్యము కీచకునికి గలిగె ఆధైర్యము.

భీముని మాటలు. అవునవును తప్పుగాదు నిజమాడితివి నారీమణి యీానవఖండపృథివిలోనున్న సురనిలయమందు పాతాళంబులోగల వుద్భట పరాక్రముల జయించిన వారలము రిపుతిమిరమార్తాండ సదృశులైనవార లము అనాథుల మరుగుజేరుటవలన వ్యర్థులమగుట నిజమే సరి విడువవే యీాపొద్దటినుంచి నలుగురికే భార్యవై మెలగుము మలయజగంధి జనులు మేలుకొనియుందురు హే కోమలాంగి ఆఖలుండెవ్వడో నాకుతోచదు రాజ పత్నియైన సుధేష్ణతో దెలుపుకొనుము ఆమె ఆఖలుని బిలపించి శిక్షింప జేయును మిక్కిలి రంతుసేయబోకు అవివేకులుందురు సందేహింతురు విను యిక్కడ నుండదగదు జనుము యిదిగాక కరిపురాధీశ్వరుండైన కురు పతితో జూదమాడ నుచితముగాదని నుడివితిని వినవిహాడాయను యుధిష్ఠి రుండు దుర్మార్గుండైన దుర్యోధనుండు నిన్ను భంగపెట్టగ ఆసమయమందు నూరుగురి దుర్యోధనాదుల దునిమి వేయవలెనని యోచించగ ధర్మరాజు కనుసంజ్ఞ సేయగా వూరకనే వుంటిని వనవాసమునయున్న సమయమున సైంధవుడు నిన్ను చంకనిడుకొని పోవుసమయమున వాని కీటడంగించితి నిన్న నీకొరకు విరటునిసభయందున్న పెనుమ్రాకు బెరకి కీచకకులము నిర్మూలంబు సేయుదమని యోచించుచుండగ ధర్మజుండు మరుగుమాటలచేత వెనుకకు బంపించెను యింకా వినుమా యిక్కడనుండక జనుమా.

సైరంధ్రి భీమునితో అనుట.

క॥ అతివిక్రమశూరుడవని । ప్రతివీరుల నడచునట్టి ప్రభలుడవనినే
గతిమాలి దెలుపవచ్చితి । బ్రతుకేటికినాకు భీమ ప్రభలస్తోమా॥

క॥ తిండికి మిక్కిలి ఘనుడవు । భండనమునకొరతగావు బ్రాహ్మణయిండ్లన్ ।
బండెడుకూడెత్తుకతిని । కండలు బెంచుకొనినీవు కదలవు భీమా॥

దరువు॥ మనుదుర్యోధనుడూ - మీాదొరతనమునుగొనెఘనుడూ - విను మముబ్రోచు కురుమూర్తిశూడూ॥ నన్నూ॥

మాటలు. యతీశ్వర నపుంసక పశుపాలక అశ్వశిక్షకులైన వార లకు శాశ్వతైశ్వర్యయుక్తములైన యీాచతుస్సముద్రపరియంత భూమండ లము పరిపాలింప యోగ్యులుగారని అల్పులతో భుజపరాక్రమము జూపుట సామాన్యమని యోచించి దుర్యోధనదుశ్శాసన శకునికర్ణులు జూదమాడి

సకలరాజ్యము గ్రహించి మిమ్ముల వనవాసమున కంపించిన వారలైరి గాక మీయందు దుర్వారపరాక్రమ విక్రమశక్తియుక్తిగలిగియుండిన నీభూమండలము పరులపాలు గానేరదని తోచబడుచున్నది యిదిగాక కపటసన్యాసులకు వంటలవాండ్లకు పశుపాలకులకు అశ్వశిక్షకులకు భార్యనై బ్రతుకుటకంటె దాసిగలవారింట దాసినై వుండుటమేలు వినుము భీమా భుజబలపరాక్రమరామ.

భీమునకు కోపమువచ్చి సైరంధ్రితో ననుట.

మాటలు. హే కుందరదన నీవన్నమాటలువిని కోపము సంధించెను వుదరమందు అగ్నిప్రజ్వరిల్లినట్లు తోచబడుచున్నది ఆమందమతి ఖలుండెవ్వడోచూపుము యీసమయమందు పట్టి బంధించి గదాదండముచేత మొత్తి విడుతును సింధుశయనుండైన శ్రీకృష్ణమూర్తినిదలచి తెలుపుము వేగా బలుకుము.

దరువు॥ నోడవుపడతుకావా సీతడవుసేయకా - కుడియెడమలమడిమెలమెలపుతోపుడమిగెడపి మడియజేతు॥ నోడ॥

మాటలు. హే పడతుకా నీనోడవులు వినిన కోపముడరెను తడయబోను వానిపుడమినడచి పొడిపొడిజేసెదను కాలరాచెదనూ యుధిష్ఠిరుని యాజ్ఞా పారవారంబున తరించితివి అజ్ఞాతవాసముభంగమైనభట్టాయన మరల అరణ్యమునకు దుర్యోధనుడు బంపునని భయము ధర్మజునకు గలదు యిక్కడ కీచకుని వధించినపిమ్మట కౌరవాదుల పుత్రమిత్ర సహితంబుగా తెగటార్చి కాలుని పురంబునకు పంపినపిమ్మట మనకు శత్రువులు యెవ్వరుగలరు నేడు తెలసి చూడు.

దరువు॥ విడువిడునీభయము నేడుఘడియలోనేనడతుచూడు॥ నోడ॥ కురుమతిగిరివరునిచరణ స్మరణజేతునెరవధింతు॥ నోడ॥

మాటలు. తరుణీమణి తెల్లతెల్లనైయ్యె దిక్కులు కలకలమని పలుకజొచ్చెను పక్షిగణంబులు అల్లనల్లన యుడుగణంబులు మాశినట్లు తోచుచున్నవి కలకొలదిగా కుక్కుటంబులు కూయదొడంగె హేసఖీమణీ నీనేర్పుచేత ఆ ఖలుని యీనాటకశాలకు ఉపాయముచేత బిలుచుకరమ్మూ జాగ్రతగ బొమ్మూ.

వ. ఆ సమయంబున ద్రౌపతిదేవి భీమునివాక్యంబులు విని సంతోషించి కీచకుని సదనంబున కేతెంచి కీచకునిగని సైరంధ్రి యిట్లనియె.

దర్వు॥ మనసుగల్గెనురానీయందూ నినుబొందగానిందూ॥ మ॥ స॥ మును నేనునినుగనుగొనినప్పటినుంచీ - మనశిజవిరహా వేదన బొందినాయను॥ మ॥ అనుమానించకుమానానందూ ఇక నైన యేమందూ అనుకూలించెను రానేడిందూ - యికతడయాకముందూ- జనము లెవ్వరికిని గనుపాడరాకుండ జనుమాగరిడికిని॥ మ॥ నిలుపజాలని మోహామాయా - మన్మధునిమాయా- వను వేమొపగవశమాయ- తెలుప రానిదాయ- వలపునిలుపుటకు నావశము లేదాయ తలచి తెనామది తల్లాడపడనాయ॥ మ॥ నన్నూ బొందినమీదానీవు- అన్యసతులగై కొనవు కన్నులెత్తీచూడబోవూ యింకానన్ను దలచేవూ- మెన్ని దెలుపుదునుమహోన్నతికురుమూర్తినున్న శ్రీహరితోడు॥ మన॥

మాటలు. వరే కీచకా నామనవి వినవలసినది యేమనగా నీమీద భ్రమచేత విరహా వేదనచే దేహాము పరవశమయినది మనసులో అనుమా నించక గరడికిపోదమురారా అక్కడస్థళము విశాలముగ నున్నది మన్మధ కేళి గూడుకుందుము వినుమూ వేవేగరమ్మా.

సైరంధ్రి కందార్థము.

ఏరాకీచక వరకుమారా - యీరాపు లేలమరు బారికి నే - నోరువగా లేనిచటికి - రారానీమమతదీర - రాజకుమారా॥ రణరంగధీరరంజితహారా- నేరాము లెంచాక యీరీతి ననుజేరి - శూరత్వమణగినా సొగసు లెంచెద వారా॥ రా॥

కీచకుని కందార్థము.

నారీమణి నేటికినా - నేరమువిడనాడిసుఖము - నొందింపగబల్ మార్గ బిలచెదవికనా - కోరికసఫలత్వమొందె॥కువలాయనేత్రీ - వచ్చెద నేను కోరియీరాత్రి - సారసపాణినాసరస జేరియధర - సారామృతమునిచ్చి సఖియ నన్నేలుమా.

భీముడు స్త్రీవేషము ధరియించుట.

దర్వు॥ భీముడు తాకామినిరూపమునూ- గైకొనెజూడగనూ ప॥ కోమలాంగులకెల్ల నుమేల్ బంతిమిగులగ నతికాంతి॥ భీము॥ కదువడిగాతానడు గూలిడుచునూ - తడబడనడచుచునూ - పణతితోడగరడిజొచ్చుచునూ - ఖలునటుజూచుచునూ॥ భీము॥ తెలియజూచెగరడిగృహామందూ - కీచకు

నిముందూ - నిలచివెదకెనాలుగుదిశలందూ గనుగొనియెనందూ॥ భీమ॥ కురుమతిశ్రీహరినీమదినిలిపి - మరుగున సతినునిచి - సరగున నరుదెంచితినీ దెలిపీ - తామరులుకొలిపి॥ భీమ॥

మాటలు. సరసిజాసన వెరువకుమని తన తెరువను మరుగుననుండ నియమించి కరచరణ బులుజరచుచు కీచకుని తనపూర్వభాగమందు గాంచి విరహాసంతాపంబుచే నిన్నుమరలుకొంటినసుచు వినిపించి కురుమూర్తిగిరి వరాధీశ్వరుని దలచి.

కీచకుడు కామినితో అనుట.

మాటలు. వనితాకులమణి వినుము నినుబొందవలెనని భ్రాంతిచేత అన్నోదకములు నిద్రయు వదలితి యితరసౌఖ్యములు మరచితి మన్మథుని శరములున్ను నన్ను బాధించుచున్నవి మన్నించి సురతక్రీడకు అనుకూలించవె యింతీ తీర్పవే నామనోభ్రాంతి.

కీచకునికి కామినికి వాదం.

దరువు॥ నారీవేగమె రావెరావెవయ్యారి - నే గనుదును దారి నారీ॥ ప॥ నారీమరునికతారికులుకుమితారీ - సారెసారెకును కోరి వేసారితి॥ నారీ॥

మాటలు. హే బాలా ఆలస్యమేలా పరియంకము మీదికి రమ్ము కౌగలిమ్ము యీజగమందు నన్ను మోహించని స్త్రీలులేరిందూ నీలవేణి చిగురాకుబోణి నా యింట గలిగిన మహదైశ్వర్యంబు నీదేగద బాలా తెలియరాద.

కామిని కీచకునితో అనుట

దరువు॥ ఓరి వచ్చితిరా నినుకోరి తెలుపుదు వినార॥ వోరీ॥ మేర మీరినను కోరినందుకును - మారుబారికడ తేర్చిపోదును॥ రో॥ ఘనమైన పురుషులు సోదరులునాకు - తెలిసిన నీకు అనుమానముంచబోకు - దినదినము సిను బోరాడగ - అనుకూలించెను గనుమిక సౌఖ్యమును- వో॥ సరిగా కీచకుని మాటలు వినుచు - మెల్లన నడుగిడుచూ త్వరగా పరియంకముపై కౌగిలిడుచు - వానిని గనుగొనుచు - కురుమతి శ్రీహరిని దలచుచునూ- వోరి॥

వ. ఆ సమయమునను భీముడు కీచకుని కురులుబట్టి విదళించిన సింహ బలుడు భీతిజెంది కురులు విడువుమని కామినిని వేడుట.

దరువు॥ తరుణీమణి కురులువిడచి కరుణతో నన్ బ్రోవవే - యెరుగక నేనాడినమాటలుమరువుసుమ్మి మతిలోనుంచకు॥ తరు॥ విడువిడునీపాద ములపైబడెద పణతిచూడవె - వడలువణకదొడగెనిపుడు - కడుదయతో విడువవె॥ తరు॥ మరిమరినీసరిబోరని వరబలిమికిమెచ్చితీ - శరణాగతనను గాచిన - కురుమతిశ్రీహరిమెచ్చును॥ తరుణీ॥



భీమునికి కీచకునికి వాదం.

భీమ-దరువు॥ కడువడివడముడిరానేసి - దుడుకడిచెద చూడూ నేడూ కుడియెడమల మడిమలతో నడచిన - విడుపించెటి వాడూ లేడూ॥

కీచ-దరువు॥ పడతియనుచు భ్రమపడితిగాని నీ - వడి నెరుగక పోతీ చెడితీ నిడుదలైన నీ యడుగులమీదను బడియెద కృపజూడూ॥ నేడు॥

భీమ-దరువు॥ కీచకాధమా నీ పీచ మడంచెద దాచుకొనె వెందూ యుందూ-నీచాత్మక నినుజూచి సహింపను వా దెరచిన దృంతూ నడంతూ॥

కీచ-దరువు॥ గంధర్వులసతి సుందరి యిదియని ముందు నేరనైతీ యీ రీతి-పొందుకున్న నా మందమతికి తేమందు మోసపోతిన రాతి॥

భీమ-దర్వు॥ గదనిదెగను నీ హృదయ జనిత దుర్మదమది వదలింతు వ జింతూ - ముదితలనెంచుట మొదలగు పాపము వదలక నిను ముంచూ గాంచూ॥

కచ-దర్వు॥ నారిగాదు ముక్క మారిరా యిది నే తేరి చూడనైతినీ రాతి - మేరమీరినే కోరి పోరుటకు సారబలము తగ్గే ముగ్గే॥

భీమ-దర్వు॥ శిరు లలరగ శుభకరముగు కురుమతి గిరివర మందిరునీ-హరినీ స్మరియించర నీవర హృదయంబున - దురితములును మానీ పూనీ॥

వ. ఆసమయంబున కీచకుడు తెగువజేసి భీముని వక్షస్థలమున బొడిచిన భీముండు నేత్రంబులు నెఱ్ఱజేసి దంతఘర్షణంబుజేసి మదవారణంబుపై సింహంబు లంఘించుకైవడి కీచకునిపై దుమికి యణచిపట్టి ముష్టిఘట్టణంబు లొనర్చుచు మోకాలితో బొడచుచు లేవనెత్తి భూమికి నుతుకుచున్న కీచకుడు రౌద్రాకారుండై భీమునిపట్టు వదలించుకొని తిరుగా భీముని పాదంబు గురిగా జూచి పిడుగుబడు చందంబున బొడిచిన భీముడు మూర్ఛిల్లి పర్వతంబు రీతి ధరపై వ్రాలగా ద్రౌపది దుఃఖించుట.

ద్వి ప ద.

హా మనోనాయకా హా హృదయేశ - హా మానధనయుత హా ప్రాణనాథ - నీముఖకాంతియు నీనేత్రయుగళి - నీమోవి సరసత నీయగుభుజము-నీబాహు యుగ్మంబు నీవిక్రమంబు-నీబలోన్నతియును నీధైర్యమూను - నీ యురస్థలమును నీకటిస్ఫురణ - నీ యిరుపదముల నిరవొంద జూచి- గీష్పతియైనను గీర్తింపలేడు - నీపేరు విన్నను నిక్కంబుగాను - భూపతులకు నెల్ల బుగులుబుట్టించు - యిట్టిసాహసునకు నెటులాపదాయె - ఘట్టిగా యీరీతి ఘటియించె నేడు - మారుతీ మీ తండ్రి మదిలోన దలచి - భూరిబలంబున బుద్ధి నూహించి - చటుల వేగంబున చపలుని బట్టి - నిటలాక్షు మదినిల్పి నిమిషంబులోన-సతతంబు కురుమూర్తి సదయుని దలచి- హాత మొనరింపుము ఆశ్చర్యముగనూ॥

దర్వు॥ యేమో మాయాయటుదోచదాయా - స్వామికృపలేక చావగనాయా॥ యే॥ లక్కయిల్ వెడలిబల్ గ్రక్కున నడువా - పెంపెక్క హిడింబుని ద్రొక్కి చంపితివీ॥ యే॥ నుతబలోన్నతుడై యీక్షితిలో వెలయు బకుని - మృతినొందజేసిసమ్మతిగాంచుశూరుడ॥ యే॥ నాటిబలము యీనాటికేమాయె - మేటిశూరుడవయ్యు మేదినీబడుట కురుమతి శైలమందిరుడాగుహారినెంచి - దురితాత్ము కీచకు దునుమూ కటులైతివి॥ యేమో॥



కీచకుడు.



భీముడు.

వ. ఆసమయంబున ద్రౌపది చాలసేపు దుఃఖించి కురుమతిగిరి మందిరుండైన శ్రీకృష్ణపరబ్రహ్మమూర్తిని మదిలో ధ్యానించి వాయుదేవుని గొనియాడి తలుపు వారగ జేసిన వాయువు భీముని హృదయంబునసోకగ భీముడు నిమరించినవాని తెరంగునలేచి కీచకునిజూచి మహారౌద్రాకారుండై దంతంబులు పటపటకొరికి నేత్రంబుల నిప్పులు రాలుపగిది సింహనాదంబుజేసి కీచకుని నేలంబడద్రోసి వాని పాదములుబట్టి గిరగిర ద్రిప్పి గరడి గృహమునకు నుతికి కరచరణంబులుశిరస్సున్ను పొట్టలోబెట్టి వాని ముద్దగాజేసిన ద్రౌపది సంతోషించి వాని రుధిరంబు తిలకంబుగా నొష్ట చుక్క ధరించెను.

ద్రౌపదిదేవి భీముని కొనియాడుట.

దరువు॥ సమరారివిజయా భీమాబలోద్దామ॥ స॥ప॥ మమభయోపమిశమనరిపుకులదమనవిక్రమధురీణ॥ స॥ మునునినుగనుగొంటిని। నామనవిచేకొనుమా యనియంటీని। వినియువిననటులుండినను బొమ్మని పరాఙ్ముఖుడైనపిమ్మట। మనసులో వెధదెచ్చినే నిన్ననినమాటలకును క్షమింపుము॥ స॥ దిగులుదీరెను నేటికీ వేమారునే బొగడెద ముమ్మాటికీ। సగమురాత్రివేళగరడిలోమగువ రూపముదాల్చిపగతుని। తగవనంచిన నీదుశౌర్యము బొగడతరమా జగములోపల॥ స॥ పరిపాలన సేయునూ మిక్కలి సత్కరుణాతోననుగావుమూ నిరతమూకురుమూర్తి శ్రీహరిచరణములు సేవించుచుండేటి। పరమ భాగవతోత్తమూ డన బరగితివి యీ ధరలోపల॥ సమ॥

వ. ఆ సమయంబున భీముడు ద్రౌపదిని అక్కడనే వుంచి తాన్ని గుప్తస్థలంబునకు జనినపిమ్మట ద్రౌపది అక్కడవున్న వారలకు జెప్పుట.

మాటలు. వరెతలవరి నాయకులార విచారించుకొనవలసినది యేమనగా నీచకీచకుడు గంధర్వులచే మృతిజెందివున్నాడు దుండగీడు అంత తలవరులు కీచక కళేబరముజూచి దిగులుజెంది అతి త్వరగానే కీచకుని తమ్ములతో దెలుపగా వారలు శోకాయత్తచిత్తులై ఉపకీచకుడు అతి వాచకుడు ప్రతిగర్జితుడు సింహకేతుడు ముఖభీకరుడు రక్తలోచనుడు అసమర్థుడు అతిభుజుడు అతిక్రోధనుడు మందకర్ణుడు మొదలైన రాక్షసులు మహారౌద్రాకారులై యస్త్రశస్త్రగదా భిండివాల తోమర పరిఘపట్టస సాధనంబులతో బయలుదేరి విరాటనగరంబు ప్రవేశించి తలవరులవల్ల అనబడిన స్థలంబు జేరి తమ అన్నయైన కీచకశవముజూచి చాలా దుఃఖితులై కళేబరముజూడగా కరచరణంబులు పొట్టలోగని యీచిత్రవధకు విచిత్రులై అక్కడ నిలుచున్న సైరంధ్రినిజూచి దీనివలననే మాయన్నప్రాణంబులు పోయినవని పట్టిబంధించి అన్నశవముపై అంటగట్టవలెనని యోచించి అందులో కొంత రాక్షసులు విరటుని కడకేగి జరిగిన సమాచారంబు దెల్పుట.

దరువు॥ వినుమువిరాటభూపాలా - మేమువినగచెప్పెదము మీమ్రోలామునిమాపుసైరంధ్రివనితకై గంధర్వజనులు కీచకునిదునిమి పోయినారు॥ వి॥ యెట్టిగంధర్వులోకానీ- గురుతుబట్టకుండగజంపెవానీ- పొట్టలోపలకాళ్లు బెట్టిచేతులుతల - యెట్టిమూటావలెగట్టిపోయినారు॥ వి॥ మేములేకుండగాజూచి - వెనుకసాముగరడిలోపొంతగాచీ - కామాంధకారుడై గనుగొనకుండగా - తామొచ్చిఖండింపయేమి చోద్యమయ్యె॥ వి॥ వారిసతినీదొరుకబట్టి చచ్చినవానిపై నీనంటగట్టీ - గొనిపోవగనువారుజనియడ్డగించినను అనుమానింపక- మేముహతముజేసెదాము॥ వి॥ సెలవివ్వదగుజాగులేలా- యింతపలుమారునూదెలుపనేలావలనొప్పుకురుమూర్తినిలయుడౌహరికరుణగలుగు దొరవనినీకు దెలుపవచ్చినాము॥ వినుము॥

వ. ఆ సమయంబున విరాటునకు దెలియవచ్చి కీచకుని కళేబరంబుపై బడి వుపకీచకులు శోకించుట.

దరువు॥ కీచకాహాహావోకీచకా॥ ప॥ నీచభామినికై చావుసిద్ధించె - నీచావుయింతపరాచకమైతోచె॥ కీచ॥ యీచందమాటకుూదోచనిదాయె

నీచాపునకుయిదిగాచుకున్నదియో॥ కీచ॥ రాచకార్యమెటులాడోచకున్న దియో - నీచూపుదగిలీన యేచానవిడువావు॥ కీచ॥ నీచిన్నతమ్ములబ్రోచె వారెవ్వారు - నీచుట్టములువచ్చి జూచిపోదురుగా॥

వ. అట్టిసమయమందు వుపకీచకులు ద్రౌపదీదేవిని దొరుకబట్టి రెండుకరంబులు వెనుకకు విరచికట్టి అన్నశవముపయి నంటగట్టి తమపురికి నెత్తుకొనిపోవు సమయంబున ద్రౌపది దుఃఖించుట.

ద్వి ప ద.

శ్రీరమానాథయాశ్రితపారిజాత - భూరిగుణాన్వితపృథులవిఖ్యాత - వాసుదేవముకుందవరదసానంద - కేశవ మాధవా కృష్ణ గోవింద - సామ జాధిపపోషసుగుణవిశేష - నామొరాలకింపుము నన్నురక్షింపు - ఉపకీచ కులుగూడివచ్చియీవేళ - చపలమనస్కులై చేతాళ్లుగట్టి - గొనిపోవుచు న్నారు కుటిలరాక్షసులు - ననగనుగంధర్వనాతినినన్ను - వలతులైనాకు నె వ్వరులేనిచోట - పొలతినిననుగొనిపోవుచున్నారు - వరపురజనులార పు ణ్యాత్ములార - సురసిద్ధులార కిన్నరయక్షులార - నరవరోత్తములార నరప తులార- ఘనులారయీసభా జనులారమీరు- ననువిడిపించుట న్యాయంబు మీకు- నాచెరవిడిపించి నన్నురక్షింప- మీచేతనౌనని దోచుచో మంచి- సమయంబుసుమ్మి వోసజ్జనులారా॥

దరువు॥ శోకవరాళి॥ యెందున్నవారుమీరూ - మొరవినదగూగం ధర్వపతులేవురూ - యిందుప్రేతబంధులందారు గుమిగూడి - యెందుబోని వ్వాక బద్ధించియున్నారు॥ యెం॥ కనికారమింతలేక - విరచికట్టుకొనిపోవు చున్నారిక - మనసునమీకభిమాన ముండెనేని - దనుజాల తెగటార్చినను విడిపించరే॥ యెం॥ నాచెరవిడుపించుడి - యీసభకెల్ల నేజేతుమనపొక్కటి కాచిరక్షించేటిఘనులానందరిని - శ్రీచక్రధరుడింక సిరులిచ్చిరక్షించు॥ యెం॥ దరిదాపునేనెరుగానైతీ - చెరవిడిపించె పురుషూలగననైతినీ - పరమభక్తుల బ్రోచుబిరుదుగల్గినట్టి - కురుమూర్తి హరికృప యెటులౌనోకాని॥ యెం॥

క॥ అంతటభీముడు పడిజని। కాంతనుగొనిపోవుచున్న కలుషాత్ములన్। వంత మునజంపి పిదపన్। కాంతను విడిపించెనొక్క ఘడియన్ జనియున్॥

## మంగళ హారతి.

మంగళహారతులివ్వరే - మదనసుందరాంగునకూ - మంగళ ప్రదుండైనగోపాంగానాజనాలోలునకూ॥ మం॥ రాధారుక్మిణి సహితుడౌ శ్రీరాజీవదళనేత్రునకూ॥ మం॥ సాధుజనులాహృదయా కమలసదనుడౌ సర్వాత్మునకూ॥ మం॥ తాపసాళిసంరక్షునకు దైవతాధ్యక్షునకూ - పాపారహితులైన పంచపాండవపక్షునకూ॥ మం॥ కాంచనాంచితాచేలునకు కంసామదవిఘాలునకూ - సుచితంబుదోలగించెసద్గుణాసంశీలునకూ॥ మం॥ భాసురాకురుమూర్తిశైలనివాసుడౌ శ్రీనివాసునకూ - భూసురార్చిత రామదాసపరిపాలూనకూ॥ మం॥

క॥ ప్రాలాశ్రభలు తప్పులు। చాలాగలవేనుశబ్దసంగతు లెరుగన్
గేలిన్ బెట్టక తిట్టక। పోలంగాదిద్దరయ్య బుధవరులారా॥

భీమసేనవిలాసం - యక్షగానము,

సంపూర్ణము.



అమెరికన్ డైమండు ముద్రాక్షరశాల, చెన్నపురి, (24-11-86, 2000.)